# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

చతుర్థ [ప్రత్యేక] వార్షిక సంచిక

సంపుటము 4     రాజమహేంద్రవరము 1-11-1980


## —* ఈ సంచికలో *—



—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా

సంవత్సరమునకు రు. 12—00.

అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై

వార్షిక సంచిక వెల 1-5

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry

సంపుటము 4 రాజమహేంద్రవరము 1-11-1980 సంచిక 1


 వార్షిక సంచిక 

## 1. కవిత్వము - చిత్రకవిత్వము

— శ్రీ జి ధర్మేశ్వరరావు, ఎం ఏ.

అర్థము లేదా ధ్వని ప్రాధాన్యమును బట్టి కావ్యము మూడు విధములు అవి 1 ధ్వనికావ్యము 2 గుణీభూతవ్యంగ్య కావ్యము 3 చిత్రకావ్యము కావ్యప్రకాశమున మమ్మటుడు చిత్రకావ్యమును గూర్చి ఇట్లు చెప్పియున్నాడు 'శబ్దచిత్రం వాచ్యచిత్ర మవ్యంగ్యం త్వవరం స్మృతమ్ (ప్రథమోల్లాసము 5) అవ్యంగ్య మనగా వ్యంగ్యత్వమే లేనిదని అర్థము చెప్పకొనరాదు ఈ విషయమున ఆంధ్రసాహిత్య దర్పణము చతుర్థపరిచ్ఛేదము పుట 130 న వివరణము కలదు

కొందఱు చిత్ర మనుపేర మూడవ కావ్య భేదము నిచ్చగింతురు ఇట్లు చెప్పుదురు శబ్దచిత్రము వాచ్యచిత్రము నని అవ్యంగ్యమో అధమముగా చెప్పబడినది, అని అదిసరిగాదు ఏలన అవ్యంగ్యత్వ మనగా వ్యంగ్యాభావమేని, ఆ పక్షమున దానికి కావ్యత్వమే లేదని మున్నే చెప్పబడినది ఈషత్ వ్యంగ్యత్వ మన నేమి? ఆస్వాద్య వ్యంగ్యత్వమా, అనాస్వాద్య వ్యంగ్యత్వమా? తొలి దేని ప్రాచీనభేదములలోనే అంతర్భూత మగును రెండవదేని కావ్యత్వమే లేదు ఏలయన ఆస్వాద్యత్వము కలదేని అప్పుడు 'అక్షుద్రత్వము' సిద్ధమే క్షుద్రతయున్న అనాస్వాద్యత్వము కలుగుటం బట్టి ఇట్లు ధ్వనికారుడు చెప్పియున్నాడు ఇట్లు వ్యంగ్యముయొక్క ప్రధాన గుణభావములచేత రెండుకావ్యములు వ్యవస్థితములు వానికంటె నితరము ఏది కలదో అది చిత్ర మబడును ' అని

కావున దీనినిబట్టి వ్యంగ్యార్థ మస్ఫుటముగాఁ గాని, గూఢముగా గానియున్నచో నది చిత్రకావ్య మనబడును, అని అర్థము చెప్పకోవలెను

జగన్నాథుడు కావ్యములు నాల్గు రకము లని పూర్వుల గుణీభూత వ్యంగ్య కావ్యమునే రెండుగా చెప్పెను అతని నాల్గవదే చిత్రకావ్యము యత్రార్థ చమత్కృత్యుపస్కృతా శబ్దచమత్కృతిః ప్రధానం తదధమం చతుర్థమ్'' అర్థచమత్కృతితో నలంకరింపబడి శబ్దచిత్రము ప్రధానమైనచో నది యధమము, అని అర్థము ఇట్లు శబ్దచిత్రము, అర్థచిత్రము అని రెండు భేదములతో చిత్ర మున్నట్లు చెప్పియున్నాడు

అర్థచమత్కృతి లేశముగూడ లేక కేవలశబ్ద చమత్కృతిమాత్ర మే యుండున వి ఐదవకావ్యములనియు అవి ఏకాక్షర్యాదులు, పద్మబంధాదులు ననియు పేర్కొనెను

అసలికని రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అన్నదానిలో రమణీయార్థమే లోకోత్తర మగు నాహ్లాదము కలిగించును అట్లు లోకోత్తరమునే చమత్కార మందురు ఈ చమత్కారమే శబ్దగత అర్థగత శబ్దార్థగతమై యలరారును

క్షేమేంద్రుడు చమత్కారము పది విధము లనెను 1 అవిచారిత రమణీయము 2 విచారణీయ రమణీయము 3 సమస్తసూక్తివ్యాప్తి 4 సూక్త్యేకదేశదృశ్య 5 శబ్దగతము 6 అర్థగతము 7 శబ్దార్థగతము 8 అలంకారగతము 9 రసగతము 10 ప్రఖ్యాత వృత్తిగతము

ఈ చమత్కారమునకు మఱొక పేరు చిత్రము అది శబ్ద, అర్థ, శబ్దార్థ చిత్రములుగ పిలువబడుచున్నది

కావ్యమున కాత్మ ధ్వని అది వస్తు అలంకార, రసరూపముగా నుండును. ఈ రసధ్వనికి ఎక్కువ ప్రాధాన్యము నిచ్చినవాడు ధ్వన్యాలోకమునకు 'లోచన' వ్యాఖ్య వ్రాసిన అభినవగుప్తుడు రసమే కావ్యాత్మ వస్త్వలంకారధ్వనులు కూడ రసపర్యవసాయులే ఇట్లే విశ్వనాథుడు, మహిమభట్టు కావ్యభావికము రస మనిరి కావ్యమునకు అందలి రసమునకు వ్యంగ్యవ్యంజక భావముకాక, భావ్యభావకసంబంధ మని భావించిరి అప్పుడు రసభావాదుల నుద్దీపింప జేయునవి అలంకారములు తద్ద్వారా కావ్యములకు శోభ చేకూరును ఔచిత్యము ననుసరించి చేయబడిన శబ్దాలంకార సంఘటనము పాఠకుల కానందము చేకూర్చుడు సన్నివేశముల కనుకూలములై యలరారునప్పుడు శబ్దాలంకారములు కూడ సౌందర్యావహములే యగును 'సౌందర్య మలంకారః' అను వామనుని మాట దీనినే సమర్థించుచున్నది అందుకే కాబోలు ఉత్తమ కావ్యములలో సహితము ఇవి చోటుచేసికొనినవి వాల్మీకి రామాయణమున సుందరకాండ పంచమసర్గలో అంత్యప్రాసనియమము కనబడును కాళిదాసుని రఘువంశము నవమసర్గము యమకమయము సంస్కృతకవులు వన, యుద్ధ వర్ణనాదుల సందర్భమున శబ్దాలంకారములను గూర్చి రని చెప్పవచ్చు

ఆంధ్రకవులుగూడ వన జలక్రీడా పుష్పాపచయముల వర్ణనాదులందు శబ్దాలంకారములను ప్రదర్శించిరి పోతన భాగవతము శబ్దాలంకారముల పుట్ట చిత్రకవిత్వములో ఎక్కువభాగము శబ్దచిత్ర ప్రధానమే అందువలనే కాబోలు ఆలంకారికులు శబ్దచిత్రమును శబ్దాలంకార శీర్షిక క్రింద వివరించిరి. రసభావాదుల పోషణలో ఆరసవాహినికి అడ్డురాకుండ ఉండునంతవరకు ఈ శబ్దచిత్రము అలంకారముగ వాడబడవచ్చు అని మనము భావింపవలెను ప్రాసాది చిత్రబంధగర్భకవితలు శబ్దవితతికి అలంకారవితతులయ్యె అనెడి అప్పకవి మాట ఈ విషయమునే రూఢి యొనర్చుచున్నది

ఇక అర్థచిత్రవిషయమునగూడ కొన్ని అర్థాలంకారములు వాడబడదగును శ్లేష, సమాసోక్తి వక్రోక్తి ఆక్షేపము, విరోధాభాస మున్నగునవి శ్లేష వక్రోక్తిలో ఉండి సౌభాగ్యమును పెంపొందించును వక్రోక్తి చమత్కార శోభితము గూఢోక్తి వక్రోక్తి చమత్కారములను చ్యుతగూఢాది చిత్రముల కననగును ఇవి వస్తువ్యంగ్య ప్రధానములై ఉత్తమ కావ్యములుగఁ జేయును

ఆకారనియమ చిత్రమని హేమచంద్రుడనినదే బంధకవిత్వము దీనిని చిత్రాలంకార మని ఆలంకారికులు పిలిచిరి రసభావాదుల పోషణసందర్భమున నిది ఎంతయో తోడ్పడును యుద్ధసమయమున నొక ఖడ్గమో లేదా చక్రమో ప్రయోగింపబడిన దనుకొందము ఒకమాట చెప్పినదానికి, దాని ఆకారము చ్చటచూపిన దానికి వ్యత్యాసమున్నది ఆ చిత్రమును జూచుచు చదివిన ఆభావము సహృదయుల మనస్సున పోషింపబడును తప్పక అవతలి వ్యక్తి ప్రయోగించినవానిముందు నశించును, అను భావము పాఠకులయందేర్పడును అర్థచమత్కార మేమియు లేక పోయినను భావము నుద్దీపింపజేయ గల్గుచున్నది

చిత్ర కవిత్వమును భారవికితార్జునీయమున, మాఘుని శిశుపాలవధ కావ్యమునందు ఒక సర్గమొత్తమున చిత్రించిరి ఆనందవర్ధనుడు తన దేవీశతకము నొక చిత్రకళామందిరముగా దీర్చిదిద్ది చిత్రకవిత్వముపై తన మమకారమును దీర్చుకొనెను

రసాభాస సంఘటనములందు దీని వాడక మెంతయో తగియున్నది అందుకు సంస్కృతమున నీతివర్మ రచించిన కీచకవధ ఉదాహరణము

'అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్' అను ధ్వన్యాలోక కారికను గ్రహించి కావ్యమున కౌచిత్యమే జీవిత మని ప్రతిపాదించినవాడు క్షేమేంద్రుడు ఇతని గ్రంథము ఔచిత్య విచారచర్చ ఔచిత్య సహితములై యుండునపుడే గుణాలంకారాదులు సార్థక్యము వహించును, అని ఇతని భావము కావున సందర్భోచితిని పాటించి చిత్రకవితాభేదముల వాడకము చేయవలెను దండి దశకుమారచరిత్రలో పెదవులు కలవని వాని చేత నిరోష్ఠ్యములు పలికించుట చూడ ఎంత ఔచిత్యమో సహృదయులు గ్రహింపవచ్చును అప్పుడా కవిత ఉత్తమోత్తమ మని అనుట చెల్లును

దీనిని బట్టి ఈ చిత్రకవిత్వము కావ్యములలో ఎంతవర కుపయోగింప దగును? అన్నది విచారణీయము

మహాకవి రసపోషణకావించు ప్రయత్నమున ఉపమాద్యలంకారములు సహజముగనే ఉద్భవిల్లును కనుక అవిరసాంగములగును 'ఇక యమకాది చిత్రములు పృథక్ప్రయత్నము వలననే కలుగునవి కావున రసాంగములు కావని, రస నిర్వహణలోపము జరుగు నని' ధ్వన్యాలోక కర్త భావించెను

కావ్యానుశాసనకర్త హేమచంద్రుడుకూడ ఇట్లే ప్రశ్నించెను 'నదీపర్వతాది వర్ణనలు విరివిగ చేయుట రసభంగమునకు కారణ మని భావించుచున్నప్పుడు యమకాదు లసలు రసవిరోధులు కాక మరేమగును' అని

విశ్వనాథుడు 'బంధకవిత్వము' కావ్యములకు కణితివంటిది ప్రహేళికలు రస విరోధులగుటవలన అలంకారములు కావని ఇటు పలికెను

'రసస్య పరిపంథిత్వా
న్నాలంకారః ప్రహేళికా'
ఉక్తివైచిత్ర్య మపి సా
చ్యుత దత్తాక్షరాదికా'
[సా ద 13]

పై వారిట్లభిప్రాయపడుచుండ ఈ క్రిందివారు అందుకు భిన్నముగ చెప్పుట యే కాక చిత్రకవిత ప్రయోజనమును గూడ వివరించిరి

దండి, భోజుడు మొదలగువారు యమకాదులను విశేషాదరముతో నిరూపించిరి పలు విధములైన బంధచ్యుతకాదు లాలాక్షణికులచే ప్రదర్శింపబడినవి బహురూపములైన ప్రహేళికలు పూర్వాచార్యులచే ఆదరింపబడిన వనియు వానిలో కొన్ని సుగమములు కావు కావున సుగ్రాహ్యములైన పదునారింటినిమాత్రము తాను వివరించు నని క్రమముగా షోడశప్రహేళికాభేదముల విశదీకరించినవాడు దండి. రసవిరోధులని ఉపేక్షింపక ప్రహేళికల ప్రయోజనమును స్పష్టపరచెను

'క్రీడాగోష్ఠీ వినోదేషు
తద్జ్ఞైరాకీర్ణ మంత్రణే
పర వ్యామోహనే చాపి
సోపయోగాః ప్రహేళికాః'
(కా ద III 97)

ప్రాచీను లీ వినోదముల నాదరించినట్లు బాణభట్టు కాదంబరిలో సూచించెను

'కదాచి దక్షర చ్యుతకమాత్రా
చ్యుతక బిందుమతీ
గూఢ చతుర్థపాద ప్రహేళికా
ప్రదానాదిభిః'

అనుటచే చిత్రకృతులతో నాటివారు వినోదించుచున్నట్లు స్పష్టము

ఈ శబ్దాలంకారము లన్నియు గద్యపద్యములలోను రసానుగుణముగ కవులచే ప్రయోగింపబడవలె నని ఇట్లు ప్రకాశవర్షుడు నొక్కి చెప్పెను.

'అమీచ శబ్దాలంకారాః
పద్యే గద్యే చ కోవిదైః
కార్యాః సందర్భ శోభాయై
యథౌచిత్యం యథారసమ్'
(రసా. అలం)

సందర్భశోభను కూర్చుటకై ఔచిత్యమునకు రసమునకుం దగినట్లు చిత్రకవిత వాడకము డవలె ననుట దీని భావము.

అంతియే కాక ఈ శబ్దాలంకార చిత్రోక్తులు వాగ్దేవికి సముజ్జ్వలాభరణము లనియు ఈ శాస్త్రకారు డిట్లు పల్కెను

'జాతి స్తస్యత్ర వాగ్దేవ్యా
మూర్తి స్తద్జ్ఞైరుదీరితా
రీతయ స్త్వంగ సౌందర్య
లావణ్య మథ వృత్తయః
రచనా ఘటనే దేవ్యాః
మండలే పరికీర్తితే

లీలాకమల మౌచిత్యం
వాసః ప్రశ్నోత్తరమ్ పరమ్
ప్రహేళికాం తు పదక
మనుప్రాస తు కంచుకమ్
క్రీడాశకుంతిం యమకం
గూఢోక్తిం కేళి కందుకమ్'
(రసా 6 III 66-74)

ఇట్లాతడు సరస్వతీదేవికి విలాసవాసముగా, పదకముగా, కంచుకముగా క్రీడాశకుంతముగా కేళికందుకముగా ఈ ప్రశ్న ప్రహేళికాది చిత్రముల నుగ్గడించుటయే కాక,

'వినాచ శ్లేష చిత్రాభ్యాం
కీదృశీ వాగ్విదగ్ధతా'

శ్లేషచిత్రము లేని వాగ్విన్యాస సామర్థ్య మెట్టిది? అని నిగ్గదీసి అడిగెను.

చిత్రకవిత్వము రసవిరోధి అని చెప్పిన ఆలంకారికులహృదయము గమనించినచో కవి తన ప్రజ్ఞాపాటవముచేత, వ్యుత్పత్తి-అభ్యాసాది గుణాధిక్యముచేత, శబ్దగత పాండిత్య ప్రకర్ష చేత నిటు రసపోషణము గావించుచు, నటు ఎడనెడ చిత్రకవిత్వమును వెలయించుచు కావ్యమును నిర్మింపవచ్చును, అని గ్రహింపవలెన. రసపోషణమునకు చిత్రకవితా రచన మడ్డుతగులు నని వారు భావించిరి అది లేనిచో ఆలంకారికుల కభ్యంతర మేమియుండును ?

చిత్రకవిత్వము నెడనెడ కాక ఒకే చిత్రకవితా భేదముతో కావ్య మాసాంతము రచించినవా రున్నారు ఉదా - నిరోష్ఠ్య కావ్యము నిరోష్ఠ్య రచనా విధానమునకు ఒండు రెండు పద్యములు వ్రాయునప్పటికే కవి అలవాటు పడును అప్పు డిక ఆ చిత్రరచనా విధానముపై దృష్టి నుంచనవసరము లేదు ఇక దృష్టి వర్ణనలు అలంకారములపై తద్వారా రసపోషణముపై తప్పక మరలును అప్పు డిట్లు నిర్మింపబడినకావ్య ముత్తమ మగును గదా

సామాన్యముగ ద్వ్యర్థి కావ్యములందు రసభావౌన్నత్యము ప్రకటించుట కంతగా అవకాశ ముండదు. కాని సూరన రాఘవపాండవీయమున కావించిన కొన్ని వర్ణనలు ప్రకటించిన భావములు అన్ని కావ్యములలోవలె కవితాచమత్కారము కలిగినవి.

వసుచరిత్రయందు కొన్ని పద్యముల శ్లేషధ్వని కల దని చెప్పవచ్చును

'చదువరులకు రుచిభేదము గలుగుట వను' గొందఱికది ఇష్టమగుటం జేసియు

రచనావైచిత్రిని మహాకవులును తమ యుత్తమకావ్యములలోఁ గ్వాచిత్కముగాఁ గావించి యున్నా రనియు, నంత మాత్రమున నుత్తమ కావ్యమునకు హాని వాటిల్ల దనియుఁ దెలియవలయును' అని సీతారామాంజనేయ సంవాదమున చెప్పబడిన మాటల నీ సందర్భమున గమనింపవలెను.

ఈ వివరణముబట్టి చూడగా చిత్రకవిత్వమునకు మూలము చమత్కారము అందు గూఢముగా గాని, అస్పష్టముగా గాని వ్యంగ్య ముండును వస్తు వ్యంగ్య పరములైన కొన్ని అలంకార రూపముల చిత్రకవిత్వ ముండును చిత్రకవిత నొక అలంకారముగ వాడదగును ఈ చిత్రకవిత్వ ప్రయోగబాహుళ్యము రసవాహినికి అడ్డు రాకూడదు ఔచిత్యమును పాటించి రసానుగుణముగ దీనిని వాడదగును మితమువిూరి చొప్పించరాదు ఈ చిత్రకవిత్వము మహాకావ్యములలోను ఉత్తమోత్తమ కావ్యములలోనూ కూడ ఉపయోగింపవచ్చును. ఒకే చిత్రకవితా భేదముతో కావ్య మాసాంతము వ్రాయునప్పుడు రసపోషణకు మిగుల అవకాశ ముండును.

ప్రధానముగ చూచిన గ్రంథములు -

1 కావ్యాదర్శము.
2 ఆంధ్రసాహిత్య దర్పణము.
3 ఆంధ్రరస గంగాధరము
4 క్షేమేంద్రుని ఔచిత్య విచారము
5 ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

## 2 సాహిత్య సృష్టిలో 'ప్రేరణ'

— శ్రీ ఆర్ ఎస్ సుదర్శనం

ఆధునిక తెలుగుసాహిత్యంలో కొన్ని ప్రసిద్ధమైన రచనల్లో ఇతర భాషా కావ్యాలప్రభావం ఎటువంటి నూత్నసృష్టికి దోహదంచేసిందీ స్థాలీపులాక న్యాయంగా పరామర్శించే ప్రయత్నం యిది ఈచెప్పబోతున్న ప్రభావం 'అనుకరణ' కాదు దీన్ని 'ప్రేరణ' (inspiration) అనవచ్చును రచయిత తనకు నచ్చిన కావ్యాన్ని, లేక కావ్యంలోపాత్రను, లేక సన్నివేశాన్ని పదేపదేమననంచెయ్యడంద్వారా అది భావనలో మొలకెత్తి, అనుభూతిని క్షేత్రం చేసుకుని, జీవంపోసుకుని సరికొత్త రూపంలో సాహిత్య సృష్టిగా వెలువడటమే దీని లక్షణం

గురజాడవారి గిరీశం జగమెరిగిన బ్రాహ్మణుడు షేక్స్పియర్ వ్రాసిన నాలుగవ హెన్రీ చారిత్రక నాటకాల్లో ఒక అపూర్వమైన హాస్యపాత్ర ఫాల్‌స్టాఫ్ 'అవినీతిపరుడూ, కుటిలుడూ అయిన ఫాల్‌స్టాఫ్ షేక్స్పియర్ పద్ధతి హాస్యానికి శిఖరాగ్రం వలె ప్రాతినిధ్యం వహిస్తున్నాడు' అన్నారు గురజాడ ఒక లేఖలో ఫాల్‌స్టాఫ్ వగైరా పాత్రలు కన్యాశుల్క రచనలో కలుగజేసిన ప్రేరణను గూర్చి గురజాడ లేఖల్లో ప్రస్తావనఉన్నది స్థూలదృష్టికి గిరిశానికీ ఫాల్‌స్టాఫ్‌కీ మధ్య తెలుగుదేశానికీ ఇంగ్లండు దేశానికీ ఉన్నంతదూరం ఉన్నది గిరీశం ఆకర్షణీయమైన అవయవ సౌష్ఠవంగల పాతికేళ్ళయువకుడు ఫాల్‌స్టాఫ్ చూడగానే నవ్వుపుట్టించే స్థూలకాయుడు, వయసుమీరినవాడు గిరీశానికి స్త్రీ సౌందర్యంమీద ప్రత్యేకమైన అభిరుచి ఫాల్‌స్టాఫ్‌కు సౌందర్యాన్ని గూర్చి పట్టింపు [illegible]

ఇద్దరిమధ్యా యింత తేడా ఉన్నా, ఇద్దరిలోనూ మూలతత్త్వం, జీవితంపట్ల నైతిక బాధ్యతలేని హాస్యదృష్టి, మాటల్లో సమయస్ఫూర్తీ, చమత్కారం, సమంగా గోచరిస్తాయి ప్రఖ్యాత విమర్శకుడు బ్రాడ్లే 'హాస్యం ప్రసాదించే మానసికమైన స్వేచ్ఛ, దాని తాలూకు ఆహ్లాదమే ఫాల్‌స్టాఫ్ పాత్ర సారాంశం' (The bliss of freedom gained in humour is the essense of Fhlstaff) అంటూ సూత్రీకరించాడు ఆసూత్రం గిరీశంపాత్రకూ అన్వయిస్తుంది. హెన్రీ-IV నాటకం రెండవ భాగం, మొదటిఅంకం, రెండో రంగంలో ఫాల్‌స్టాఫ్ తను న్యాయాధికారితరఫున పిలవవచ్చిన బంట్రోతుదగ్గర మొదట చెవిటివాడుగా, మాటలు సరిగా వినబడనట్లుగా నటిస్తాడు ఆ బంట్రోతు వెళ్ళిపోయి తిరిగివచ్చి, ఫాల్‌స్టాఫ్ చెయ్యి పుచ్చుకుని తీసుకువెళ్ళడానికి ఉద్యుక్తుడు కాబోతే వాణ్ణి అడుక్కుతినే వానినిగా పరిగణిస్తూ విదలించివేస్తాడు ఆపైన ఒట్టు వేసుకుంటూ 'నా సర్ బిరుదమూ, నా యోధత్వమూ ఆవల పెట్టి చెబుతున్నాను-నువ్వు పెద్దమనిషి వని నేనంటే, నేను పచ్చి అబద్ధాలకోరునే!' అంటాడు 'కన్యాశుల్కం'లో, ప్రథమ ప్రవేశంలో గిరీశం, ఫోటోగ్రాఫ్ పంతులు పంపిన బంట్రోతుదగ్గర సరిగ్గా యిలానే ప్రవర్తిస్తాడు మొదట చెవిటివాడుగా నటించి బంట్రోతు నిలవదీసి అడగ్గానే వాడికి చుట్టయిచ్చి మంచి చేసుకుని, చివరకు 'రేపొద్దున్న యివ్వకపోతే మాలవాడి కొడుకు ఛండాలుడు' అంటూ ఒట్టుగాని ఒట్టు పెట్టుకుంటాడు ఫాల్‌స్టాఫ్

పాత్రకి హావభావాల్లో యిలా అనుకరణగానే గిరీశం చిత్రణ ప్రారంభమైనా, గిరీశం సృష్టి ఆనాటకంలో ఎంతో అపూర్వంగా, స్వతంత్రంగా సాగింది 'Unimitated, inimitable Falstaff, how shall I describe thee' అన్నాడు జాన్సన్ అటువంటి అసాధారణ వ్యక్తిత్వంగల ఫాల్‌స్టాఫ్ సృష్టికి ప్రతిసృష్టిచేసి తెలుగు వారికి అజరామరమైన పాత్రగా గిరీశాన్ని అందించారు గురజాడ ఇది సాహిత్యంలో 'ప్రేరణ' కు విశిష్టమైన ఉదాహరణ

శ్రీ కోలాచలం శ్రీనివాసరావు వ్రాసిన ప్రసిద్ధ నాటకం 'రామరాజు చరిత్రం'లో పరానుపాత్ర, బళ్ళారి రాఘవ నటన ద్వారా చాల ప్రాచుర్యాన్ని పొందినది. ఈ పాత్రను తీర్చిదిద్దడంలో, అంతస్సంఘర్షణను కల్పించడంలో, షేక్స్‌పియర్ సృష్టించిన హేమ్లెట్, మేక్‌బెత్ పాత్రల సమ్మిశ్రణం ఒక అపూర్వసృష్టిగా తయారైంది పరాను రామరాజు పుత్రుడే, కాని అతనిపై పగసాధించడం ధ్యేయంగా కలవాడు దీనితోపాటు రామరాజు నమ్మినబంటుగా కూడా ఉండటం పరాను స్వామిభక్తి, విశ్వాసఘాతుకత్వమూ అతనిలో సంఘర్షణని ద్విగుణీకృతం చేస్తాయి అలా హేమ్లెట్ - మేక్‌బెత్‌ల ప్రత్యేక సమస్యలని పరానులో ఒకటిగా సమ్మిశ్రం చెయ్యడం జరిగింది వేదం వేంకటరాయ శాస్త్రి సృష్టి యుగంధరుని వాత్రలో 'పిచ్చి' కి కూడా యిలాగే హేమ్లెట్-లియర్ పాత్రల్లో 'పిచ్చి' ప్రేరణ అయినట్లు తోస్తుంది భమిడిపాటివారి హాస్య నాటకాలకు ఫ్రెంచిరచయిత మోలియర్ ప్రేరణ కావడం అందరికీ తెలిసిందే

నవలల్లో వీరేశలింగంగారి 'రాజశేఖరచరిత్రము' గోల్డ్‌స్మిత్ 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' కు అనుకరణఅంటున్నారు అనుకరణ అనడం కంటె ఇంగ్లీషు మాతృక 'ప్రేరణ' అయింది అనడమే సబబుగా తోస్తుంది నాకు 'రాజశేఖర చరిత్రము'లో నీలాటిరేవు దృశ్యం, ఆడవాళ్ళ సంభాషణా మొదలుకొని, వర్ణించిన ఆచారాలూ, అలవాట్లూ, సామాజిక స్థితిగతులలో, నాటి ఆంధ్రదేశాన్ని ముమ్మూర్తులా ప్రతిబింబిస్తున్న వైనం చూస్తే, దాన్ని అనుకరణ అనడానికి వీల్లేదు అలాగే ఉన్నవవారి 'మాలపల్లి' తెలుగులో గొప్ప నవల దీనికి ఇంగ్లీషులో మిసెస్ హెన్రీవుడ్ 'ఈస్ట్‌లిన్' ప్రేరణ మూలానికి ఆ భాషలో పెద్దగా సాహిత్యగౌరవం లేదు ఆ రోజుల్లో మాత్రమే అది ప్రాముఖ్యం పొందిన నవల 'మాలపల్లి'లో కమలమ్మ లేచిపోవడమూ, తర్వాత తిరిగివచ్చి తన కొడుకైన సాహుకాకి అజ్ఞాతంగా దాది పనిచేస్తూ ప్రాయశ్చిత్తాన్ని పొందడంవరకే ఆ ఆంగ్ల మాతృకనుంచి ప్రేరణ తప్ప, నవలలో కేంద్రస్థానం వహించిన సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక సమస్యల సంశ్లిష్ట స్వరూపం ఉన్నవవారి అపూర్వసృష్టి ఆధునిక నవలల్లో చెప్పుకోదగ్గ 'చివరకు మిగిలేది' సోమర్‌సెట్ మామ్ 'ఆఫ్ హ్యూమన్ బాన్‌డేజ్' నవలనుంచి ప్రేరణ పొందినట్లు రచయితే స్వయంగా చెప్పుకున్నాడు పాలగుమ్మి పద్మరాజు ఏకైక హాస్యనవల 'బతికిన కాలేజి' కి పి జి వోడ్‌హౌస్ రచనలు ప్రేరణ

తెలుగు నవలలమీద బెంగాలీరచయిత శరత్ ప్రభావం చెప్పుకోదగ్గ విశేషం. రొమాంటిసిజమ్, రొమాంటిక్ లవ్ (భావనాత్మక ప్రేమ) పాశ్చాత్య సాహిత్యంనుంచి మనకు దిగుమతి అయినా ఈ ప్రేమకు త్యాగం, కన్నీళ్ళు చాల ముఖ్యం అనే ప్రగాఢవిశ్వాసాన్ని మధ్యతరగతి యువతకు కలిగిస్తూ తెలుగులో ఎన్నో నవలలు రావడానికి శరత్ రచనలే కారణమని తోస్తుంది ప్రేమవిషయంలో చలం ప్రోత్సహించిన స్వేచ్ఛాసాహసాలకంటె శరత్ పెంపొందించిన హృదయ దౌర్బల్యమే తెలుగువారిని ఎక్కువగా ఆకర్షించింది పాదధూళి గ్రహించడం, అయోమయంగా మాట్లాడటం వంటి పాత్రపోషణ శరత్‌నుంచే సంక్రమించింది. ఈ లక్షణాలు ఇప్పుడిప్పుడే కాలదోషంపట్టి క్షీణిస్తున్న సూచనలున్నా, యువరచయిత్రులు మాత్రం వీటిని వదలిపెట్టకుండా ఉన్నారు

తెలుగు కవిత్వంమీద రవీంద్రనాథ ఠాకూర్ ప్రభావం వివరించేందుకు ఒక్క ఉదాహరణ ఆయన 'తోటమాలి' (Gardener) సంపుటిలో 34వ ఖండిక యిలా ప్రారంభమౌతుంది - 'Do not go, my love, without asking my leave I have watched all night, and now my eyes are heavy with sleep ' భావకవిత్వానికి ఆద్యుడైన కృష్ణశాస్త్రి 'ఊర్వశి' లోని ఖండిక పై పంక్తులకు ఇంచుమించు తర్జుమా -

'ఏను నిద్దురవోదునో, యేమొ కరుణ
సెలవు గైకొన కేగగా వలదు, ఇన్ని
నాళ్ళ ఎడతెని ఎడబాటు నా నిరీక్ష
ణమ్ము బరువులు బరువులై నయన యుగళి
మరియ్యె దిగలాగు నిద్దుర మరపులకును '

ఇది స్వేచ్ఛానువాదమే అయినా, కృష్ణశాస్త్రి పదగుంభనమూ, సంగీతమూ, బాణీ దీన్ని స్వతంత్రసృష్టిగానే రూపొందించాయి ఇలాంటి ప్రేరణలెన్నో! కృష్ణశాస్త్రి 'కృష్ణపక్షం' లోని 'వెర్రిపాట' విలియమ్ బ్లేక్ 'మ్యాడ్ సాంగ్' కి అనుకరణ అనడంలో సందేహం లేదు.

తెలుగు కవిత్వంలో శ్రీ శ్రీ కొత్త యుగాన్ని ప్రారంభించాడు శ్రీశ్రీకి ప్రేరణ కలిగించిన పాశ్చాత్యులు చాల

మంది వున్నారు-ఎడ్గార్ ఆలెన్ పో స్విన్‌బర్న్ నుంచీ ఆంద్రే బ్రెతన్ వరకూ నా దృష్టిలో శ్రీశ్రీ తెచ్చిన కవితావిప్లవంలో ప్రధానాంశం - కవితా సామగ్రిని అనుభూతిపరంగా ప్రేమనుంచీ ప్రకృతి సౌందర్యం నంచీ బాధవైపూ భయంవైపూ త్రిప్పి, జీవితంలోని చీకటి కోణాల్నీ, వైవిధ్యాన్నీ దర్శింపజెయ్యడం క్రౌర్యాన్ని, భీభత్సాన్నీ, భయంకరమైన ఒంటరితనాన్నీ, పదచిత్రాలతో అలతిపదాలతో శబ్దంతులతో గేయరూపంలో అభివ్యక్తం చెయ్యడం. ఫ్రెంచి సింబలిస్ట్ కవిత్వానికి ప్రేరకుడైన ఎడ్గార్ ఆలెన్ పో శ్రీశ్రీకి ప్రధానుడు సింబలిస్ట్ కవులైన బోద్‌లేర్, మలార్మే వగైరాలు ఇటీవలి తెలుగు కవిత్వానికి ప్రేరణఅవుతున్నారు. సింబలిస్ట్ కవులతోపాటు ఉర్దూకవుల ప్రభావంకూడా నేటి కవులమీద కనిపిస్తుంది సుదీర్ఘమైన వచన కవితలు వ్రాయడం నుంచీ ముత్యాల్లా, పగడాల్లా భాసించే మినీకవితలూ, ఇమేజిస్టు రచనలూ తెలుగులో నేడు అవతరించడానికి కొంతవరకు ఉర్దూ గజల్ ప్రక్రియ ప్రేరణ అని చెప్పవచ్చు

తెలుగు కథావికాసంమీద మొపాసా, చెకోవ్,ఓ హెన్రీల ప్రభావమూ ప్రేరణా చెప్పుకోదగ్గవి తెలుగు సాహిత్య ప్రక్రియల్లో ఈరకం ప్రభావం, ప్రేరణా, పరిశోధించేకొద్దీ ఎంతోమేర గోచరమౌతూపోతుంది ఏ భాషాసాహిత్యమైనా ప్రపంచ భాషాసాహిత్యాల్లో అంతర్భాగమే దాని భవితవ్యం వేరుగా ఉండటానికి వీలేదుకదా!

# 3. నష్ట రామ రూపకములు

- శ్రీ ఇప్పగుంట సాయిబాబా

'పరం కవీనాం ఆధారమ్' - అను ఆదికవి ప్రణీత 'శ్రీరామాయణము'ను ఆలంబనము చేసికొని ఎన్నియో రూపకములు సంస్కృతములో వెలసినవి మహాకవి భాసుని 'ప్రతిమా దశరథమ్', 'అభిషేక రామమ్' లు మనకు నేడు లభించుచున్న తొలి రామనాటకములు.

పరశ్శతములు రామవృత్తాంత రూపకములు పుట్టినను చాలమటుకు కాలప్రవాహంలో కొట్టుకొని పోయాయి నేడు దొరుకు రామనాటకములను వ్రేళ్ళమీద లెక్కింపవచ్చును

అభినవభారతీవ్యాఖ్య, వక్రోక్తి జీవితము, దశరూపకము - అవలోకనము, రసార్ణవ సుధాకరము, సాహిత్యదర్పణము, భావప్రకాశనము, నాటకలక్షణ రత్నకోశము నాటక చన్ద్రికా, - మున్నగు గ్రన్థములనుండి నష్టపూర్వ రామనాటకములజాడ తెలియుచున్నది కొన్నిటికి కవులనామములు తెలియుచున్నవి కొన్నిటికి కవులనామములు తెలియవు కొన్నింటికి పేరులు ఏమో?

అలంకార - రూపక విషయగ్రన్థములలో విస్తారముగా పేర్కొనబడిన మిక్కిలి ప్రాచుర్యమును పొందిన అనుపలబ్ధ రామనాటకము 'రామాభ్యుదయం' యశోవర్మ ప్రణీతము 'షడంకేదృశ్యతే లోకే, రామాభ్యుదయనాటకమ్' అని నాడు శారదాతనయుడు తన భావప్రకాశములో పరమభోజ్యమైన రచనకు ఆకరంగా రామాభ్యుదయం నిదానం అనుటకు ఆనన్దవర్ధనుడు ఉదాహరించిన ఈ శ్లోకమే సాక్ష్యము

రక్తస్త్వం నవపల్లవైః అహమపి
శ్లాఘ్యైః ప్రియాయా గుణైః
త్వామాయాన్తి శిలీముఖాః స్మరధను
ర్ముక్తాస్తథా మామపి।
కాన్తాపాద తలాహతి స్తవ ముదే
తద్వన్మమాప్యావయోః
సర్వం తుల్యం అశోక! కేవల మహం
ధాత్రా సశోకః కృతః।

వేణీ సంహారకర్త 'కృత్యారావణమ్' కూడ వ్రాశాడని జనశ్రుతి ఏడు అంకముల మితికలదని తోచుచున్నది. రూపక సంహార శ్లోకము ఇది

నిరీతయః ప్రజాస్సన్తు
సన్తస్సన్తు చిరాయుషః।
ప్రథన్తాం కవయః కావ్యైః।
సమ్యజ్ఞ్నన్దన్తు మాతరః॥

త్రికాండ వివేక వ్యాఖ్యలో రామనాథుడు 'జానకీ రాఘవమ్' అనే నాటకాన్ని పేర్కొన్నాడు ఇది ఏడు అంకముల నష్ట రామ రూపకము 'జ్ఞేయన్తు నాటకే జానకీరాఘవే సీతా నృత్యే' అని శారదాతనయుడు చెప్పుటబట్టి గీతమునకు ప్రాముఖ్యము కలదేమో? కర్త కూడ తెలియకపోవుట మిక్కిలి విచారకరము ఒక్క ఉదాహరణమూ -

మా భైషీః మిథిలాధిరాజతనయే।
దిష్ట్యాధునా వర్ధసే
భద్రం విద్ధి నిజప్రియస్య భుజయోః
వీర్యేణ గుర్వ్యో రపి।
ఆక్షేపే హసతా, స్వపౌరుషకథా-
లాపే ష్వవజ్ఞావతా
కర్షం చాప మధిజ్య కార్ముకభృతా
రామేణ రామో జితః॥

అజ్ఞాతకర్తృక 'రాఘవాభ్యుదయమ్' మఱియొక అలబ్ధ రామ రూపకము మాతృగుప్త కృతనాట్యశాస్త్ర మతాను సారము సమగ్రముగా వ్రాయబడిన రస సమంచిత ప్రబంధ మని నాటక లక్షణ రత్నకోశకర్త అభిప్రాయము నాటక కర్త తన రచన ఉపసంహారంలో తన కృతి చిరంజీవిగ మనగల దని ఆశిం చాడు కాని విధి వక్రించింది పరికిం చండి -

ప్రీతః పృథ్వీ మవతు నృపతిః,
స్వస్తి భూయా ద్ద్విజేభ్యః
క్షేమం గావో దధతు, సమయే
తోయముద్భాః సృజన్తు।
కావ్యాత్మానం స్ఫుటరస సుధా
వాహినీ కావ్యకర్తుః
కీర్తిః స్నిగ్ధా రఘుపతి కథే-
వానఘా దీర్ఘ మాస్తామ్'

మాయాపుష్పకమ్, రామానన్దమ్, అభిజాత జానకీ, స్వప్నదశాననమ్, (భీమటకవి) ఛలితరామమ్, విశాఖదేవ నిర్మిత మారీచ వఞ్చితకమ్ నిర్దోషదశర థమ్, మధురరాఘవమ్, చణ్డాలరామా యణమ్, అభినవరాఘవమ్ (క్షీర స్వామి), - మున్నగు పలు రామకథా రూపకములు, పూర్వమహాకవి నిర్మిత ములు నశించుట మన దౌర్భాగ్యము

---

# 4. కవుల కలాలలో కలహంస

- శ్రీ ననుమాస స్వామి, ఎం ఏ

సామాన్య ప్రకృతి వర్ణనలు స్వభా వోక్తి రమణీయాలు ప్రకృతిసౌందర్యా బ్ధిలో నడయాడేది కలహంస అయితేనే ఆవర్ణన విరాజమాన మౌతుంది అందుకే నేమో ఎక్కువగా మన తెలుగు కవులు తమ కావ్యాల్లో ఈరాజహంసల ప్రసక్తిని తీసుకురాకుండా ఉండలేక పోయారు కలహంసల ప్రసక్తితో పాటు కవులు వర్ణించిన రమణీయ వర్ణనలు భావనా విరాజమానములై కావ్యాల కెంతో శోభను కూర్చాయి

కవికుల తిలకుడైన కాళిదాసు తన 'మేఘసందేశం' లో

'యత్రోన్మత్త భ్రమరముఖరాః
పాదపా నిత్యపుష్పాః
హంస శ్రేణీ రచిత రశనా
నిత్యపద్మా నలిన్యః'

అనే శ్లోకంలో అలకాపురి అందచం దాల్ని గూర్చి కల్పన చేస్తున్నాడు ఆ పట్టణంలో చెట్లు నిత్యపుష్పితాలై తుమ్మెదల ఝుంకారంతో అందంగా ఉంటూ యట తామరతూండ్లు నిత్య పద్మాలై సుంద్రంగా హంసల వరుసను వడ్డాణంగా కలిగిఉంటూ యట తామర కొలన్లో చుట్టూముసరుకొన్న హంసల వరు సలో కాళిదాసుకు ఒడ్డాణపు టొయ్యా రం కనిపించింది

విక్రమోర్వశీయంలో పురూరవ చక్ర వర్తి పిచ్చెత్తి అడవిలో ఊర్వశి యని అహోరాత్రం తన ప్రియురాల్ని వెదు కుచు మానస సరస్సులోనున్న కలహం సను ప్రియురాల్ని గూర్చి ఎలా అడి గాడో చూడండి

'తెలివ నడలు నీ కెవరు నేరిపిరి
తెలుపుము రాజమరాళా!
యొతిగింపుము నీవింతి జూచితే
నే హర్షింతును జాల'

అని కలహంసకు ఆరాజు అంజలి ఘటించి నట్లు కాళిదాసు చిత్రించాడు

ప్రబంధపరమేశ్వరుడైన ఎఱ్ఱాప్రెగ్గడ 'హరివంశం'లో ప్రాతః కాలవర్ణనలో హంస ప్రసక్తి వస్తుంది

'పాడె మధువ్రతావళులు
పద్మవనీవిభవంబు కాపమున్
వీడె రథాంగకమ్ములకు
వేడుక గూడె తరంగ డోలలం
దాడె మరాళ దంపతులు
హాసవిలాసము దక్కె గక్కువన్
వాడె కుముద్వతీ ముఖము
వావిరి నూడె తమోనిబంధముల్'

అంటూ తెల్లవారు జామున హంసల జం టను తరంగ డోలికల్లో నుయ్యాల లూగించాడు

బమ్మెర పోతనామాత్యుడు కూడా తన 'భాగవతం'లో హంసల ప్రసక్తి తేకుండా నుండలేకపోయాడు

'నిర్మల మందాకినీ వీచికల దోగు
రాయంచ చనునే తరంగిణులకు'

అంటూ గంగాతరంగాల్లో నాటలాడిం చాడు

మల్లికార్జున భట్టు 'లలిమానసంబున మెలగెడు హంసకు, వెలయు పల్వల మూపై వేడ్క గలదె' అని మానససరోవ రంలో కాపురం కట్టబెట్టాడు.

నైషధం విద్వదౌషధం అని పేరుపడ్డ శృంగారనైషధంలో కూడా శ్రీనాథుడు రాజహంసల్ని ప్రవేశపెట్టాడు శ్రీనా థుడు తీర్చిదిద్దిన ఈ కలహంస నలదమ యంతుల ప్రణయానికి కారకురాలైన కారణంగా అది పొందిన గౌరవం చాలా

గొప్ప దని చెప్పాలి దూత్యంలో కల హంస ప్రదర్శించినమాటలతీర్పు అపూర్వ మైంది రాజహంస తన అభిజాత్యాన్ని ఎలా అభివర్ణించుకుందో చూడండి

'నలిన సంభవు సాహిణమువారువంబులు
కుంము సాములు మాకు కువలయాక్షి
చదలేటిబంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకు బువ్వుబోణి
సత్యలోకముదాక సకలలోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరంబులు మామాటలు వినంగ
నమృతాంధసులె యోగ్య లనుచు
మాంగి
భారతీదేవి ముంజేతి పలుకు జిలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్ర పురాణాది విద్య లెల్ల
తరుణి నీయాన ఘంటాపథంబు మాకు

అనుటలో కలహంస దమయంతికంటెను జ్ఞానాతిశయుంగల దని చెప్పకయే తెలుస్తుంది

నలుడు రాజహంసను పట్టుకున్నప్పుడు

'ఱెక్కల కొనలం గలిగిన
ఇక్కాంచన మాకపడియెదే నృప! నీకే
యక్కట దీనం దీఱెడు
నక్కట నీహారలేశ మబ్ధికి బోలెన్'

అంటూ రాజును బతిమాలు తున్నప్పు డాకలహంస తెలివికి సంభ్రమాశ్చర్యం గలుగక మానదు అంతటి తెలివైన కల హంస దమయంతివద్దకు పోయి దౌత్యాన్ని నిర్వహించి తిరిగి నలుని చేరగా దాన్నెలా మెచ్చుకొన్నాడో చూడండి.

'సరసత్వంబు నిగూఢ కార్యఘటనా
చాతుర్యసంపత్తియుం
బురుషార్థైక పరాయణత్వమును న
ర్థ్యత్వాన లీలాధురం
ధరతా ప్రౌఢియునుం గృతజ్ఞతయు వా
త్సల్యంబు సద్భావమున్
సరసీజాసన వాహనాన్వయవతం
సాహంస నీ కందముల్'

హంస అంత సుందరమైంది కనుకనే

'వరుణరాజున కిడిన చామరము వోలె
పాడవు మిగిలిన పొందమ్మి పూవువోలె
నిబిడ నిద్రాభి ముద్రిత నేత్రమైన
రాజహంస ,'

అంటూ శ్రీనాథుడు ప్రశంసించాడు.

నైషధంలో వలెనే ప్రభావతీ ప్రద్యుమ్నంలోకూడా శుచిముఖి అనే హంసను పింగళి సూరన ప్రవేశపెట్టాడు ఈ కలహంస ప్రభావతీ ప్రద్యుమ్నులకు గౌత్యం సూప నిశ్చయించుకొంది వజ్రనాభుని సంహారానికిని, సురరాజు నభీష్టసిద్ధికిని తన చతురతను వినియోగించింది దేవేంద్రుడు కలహంస ప్రావీణ్యానికి మెచ్చుకొని హంసతో

'నీ వెవ్వరి కొలదియు గా
వోవరటామణి విహంగయోషవా భాషా
ప్రావీణ్యము చూడగ వా
గ్దేవతవో కాకయాకె దిద్దిన కవివో'

అని స్తుతించాడు భాషా ప్రావీణ్యాన్ని, చతురతను గలిగియున్న కారణాన ఆ హంస పింగళి సూరనగారికి పని కొచ్చింది

శ్రీకృష్ణరాయలు 'ఆముక్తమాల్యద' లో

'ద్రవిడ కుటుంబిను ల్పసపు
రాచిన రత్నపు దాపక్రింద నం
బువు దెరవారగా నిదుర
వోయి గరుత్తతి పచ్చబాతినన్
భవన సరోమరాళములు
ధర్మమయ చ్ఛద గుచ్ఛ విస్ఫుర
ద్దివిజధునీమరాళ విత
తిభ్రమమబ్బాన్పు బురి భ్రమించుచున్'

అను పద్యంలో బంగారు ఱెక్కలుగల హంస లని భ్రమ - మన కెందులకు గలిగి నదో వివరించారు

వర్షాకాలం హంసలకు అను వైంది కాదు కారణం అబుతువు వాటికి వినాశకారి యట అందుచేత క్రౌంచనగ గుహా మార్గాన్ని ఆధారం చేసుకొని మానస సరోవరానికి వెళ్ళునని చెప్తారు అందుకనే అల్లసాని పెద్దనామాత్యుడు

'వనజేక్షణా మనోరథనపశ్యతో హారుం
డరి హంస సంసద్రభాగమంబు'

అని అన్నాడు

కలహంసలు అంతఃపురాల్లోను, అతివల ఆటపాటల్లోను,వంతులాడిన ఘట్టాలు కనిపిస్తాయి నందితిమ్మనగారి 'పారిజాతాపహరణం'లో శ్రీకృష్ణుడు సత్యామందిరం ప్రవేశిస్తూ -

'కలికి రాయంచ బోదల నల్ల నెలయించి
నడపింప రేలకో పడతు లిపుడు, '

అనుకుంటాడు

అంతఃపురంలోని హంసలు అంగనల అందెల ధ్వనిని అనుకరించి నడుస్తాయట అలంకరించి సత్యజలకమాడి తరలివస్తున్న ఘట్టంలో తిమ్మన ఈ విషయం తేటపర్చాడు చూడండి.

'జలకం బాడి
పసిండియందెరవలిన్ రాయంచ
లంతంతరా
జెలులుం దానును సత్యభామ
సనుదెంచెన్ '

సత్య స్వర్ణ నూపురధ్వని విని హంస లల్లనల్లన అనుకరిస్తున్నా యట -

'అలిమానసంబున మెలగెడు హంస' కనుటలో మానససరస్సులో మనుగడ 'జలరుహంబుల తూడ్లు భోజనంబులు' అనుటలో తామరకాడలు ఆహారం, వీనికి తోడుగా 'పాలను నీరు వేఱుపరుపంగ మరాళ మెఱుంగు ననుటలో' నేర్పు కల గలసి, హంసకు ఉన్నాయి వీటికిమించిన ప్రసక్తి బ్రహ్మకు వాహనం కావడం

లక్ష్మణకవి తెనిగించిన 'భర్తృహరి' సుభాషితంలో

(తరువాయి 9 వ పేజీలో)

# 5. వసుచరిత్ర - నాటకీయత
## అభిజ్ఞానశాకుంతలానుసరణము

- శ్రీ పానుగోటి అర్జున్ రావు, బి ఓ ఎల్

సాధారణముగా కవులు తమకంటె గొప్పవారైనటువంటి పూర్వ కవులను ఎచ్చటనో ఒకచోట అనుసరించి తమ కవిత్వము మెరుగు దిద్దుకొనుట పరిపాటి. రామరాజభూషణ ప్రణీతంబైన వసుచరిత్ర తరువాత వెల్వడిన కావ్యములకు అన్నివిధములా మార్గదర్శకమైనప్పటికి తన ప్రబంధమును నాటక లక్షణములతో కూర్చి రచించినాడు కావున రామరాజభూషణుడు అభిజ్ఞానశాకుంతల సన్నివేశములకు సరిపడు విధముగా నాటకీయ శైలిలో రూపొందించినాడు

నాటకమునసామాన్యముగా శృంగార నాయకులలో నొకడు నాయకుడుగా నుండును. అతనికి నాయకునిబట్టి విదూషకుడుగాని, నర్మసచివుడుగాని, పీఠమర్దుడుగాని ఒక సహాయ నాయకుడుండును నాయిక ఉన్నత కులగోత్రోద్భవయై యుండవలయును ఆనాయికకు చెలికత్తె లుంటారు వసుచరిత్రయందు నాయకుడైన వసురాజు ధీరోదాత్తుడు అతని చెలికాడైన నర్మసచివుడు సహాయనాయకుడు ఉన్నతకులగోత్ర సంభవయైన గిరిక నాయికగా చిత్రింపబడినది మంజువాణి ఆమె చెలికత్తె ఈవిధముగా సర్వ నాటక లక్షణములతో నాయికానాయకుల ఉద్దీపనాలంబనానుభావ విభావాదులచే చక్కని సమయస్ఫూర్తితో రామరాజభూషణుడు వసుచరిత్రను తీర్చి దిద్దినాడు

శాకుంతలము నందు నాయకుడుగా చిత్రింపబడిన దుష్యంతుడు వేటయందు కుతూహలముచే అడవికి పోవును మునికుమారులెదురై ఆశ్రమ వివరములు తెలుపగా దర్శనోత్సుకుండై వేటసామగ్రిని తీసివేసి అటు బయలుదేరును వసుచరిత్ర శృంగారప్రబంధము గనుక కవి వసంత ఋతువర్ణనమును చేసెను వనపాలకులు వచ్చి మలయ మారుతము చేసిన ధూర్త కృత్యములు రాజునకు చెప్పగా వసురాజు వనవిహారార్థమై చెలికాడైన నర్మసచివుని వెంటనిడుకొని బయలుదేరును ఉద్యానవనమున కొంతదూరము బయలుదేరగా-

ఉ॥ ఉన్నతి వన్నగాంగమున<br>
నున్న యొకానొక కిన్నరద్వయం<br>
గన్నరదేవపాదపవిభిన్న బృహన్నగ<br>
కూటవాటికన్ ॥

ఈవిధంగా రెండు కిన్నర పక్షులు తమ ముందుగా కోలాహల పర్వతము వైపునకు ఎగిరిపోవుచుండగా చూచి అది తమ కాసన్న శుభసూచకమని ఎంచి సంతసింతురు అచ్చట కోలాహల పర్వతప్రసక్తి ఆపక్షిద్వయముచే కల్పించినాడు సామాన్యముగా నాటకమునందు పాత్రప్రవేశముగాని, ఏదైన వస్తువిషయమునుగాని, చెలికానిలోనైన సందర్భోచిత సంభాషణమునందును సూచిస్తారు

శాకుంతలమునందు —

దుష్యంతుడు ఆశ్రమమును సమీపించగానే అతని కుడిబాహువు అదరినది అది అతనికి ఆసన్నశుభసూచకముగా నొప్పి మరింత ఉత్సాహపరిచెను తర్వాత రాజు ఆశ్రమప్రాంగణమునకు పోవును. అచ్చట పెంపుడు చెట్లకు నీరుపోయుచున్న శకుంతల, ఆమె చెలికత్తెలు కన్పింతురు తన మనస్సు చూచినది మొదలు శకుంతల యందే లగ్నమగుట నెంచి ఇది ఆశ్రమవాసము వీరు మునికన్యలు. వీరి యెడల (శకుంతల) నాకు వికారభావము కల్గుచున్నదిదేమి యని రాజు సందేహించును

వసుచరిత్రయందు —

ఇంత యథార్థముగా గాకుండ రాజు, నర్మసచివుడు తమ క్రీడాశైలమైన కోలాహల పర్వతమును సందర్శించగోరి అచ్చటికి బయలుదేరుదురు కొంతదూరము పోగా వారికి 'వీనులవిందై అమృతపు సోనలపొందై' ఒక అవ్యక్తసుమధుర గానము వినిపించును. ఆ పాడువ దెవరో తెలిసికొని వచ్చి రాజును చెలికాడు వారివద్దకు తీసుకొనిపోగా ఒక పూపొదరింటిలో పొందికగా కూర్చుండి వీణ వాయించుచున్న గిరికాదేవిని చూచిన రాజునకు సాత్వికోదయ భావములు కలుగును అలాగే చూచుచున్న అతని కా క్షణమందు అనిమేషత్వము కలుగును

శాకుంతలమునందు —

శకుంతల మోముపైకి గండుతుమ్మెద రాగా ముగ్ధయైన శకుంతల భయముచే విదలించుచుండ, సఖియైన ప్రియంవద తీవెలచాటున పొంచి ఉన్న దుష్యంతుని

---

( 8 వ పేజీ తరువాయి )

'వనజభవుండు కోపమున<br>
దావానమైన మంశభర్తకున్<br>
వనజభవనీ విహార కల<br>
నంబు తొలంగగ జేయుగాని గుం<br>
భనమున దుగ్ధజీవన ఎ<br>
భాగ విధాన నిరూఢ నైపుణీ<br>
జనిత మహా యశోవిభవ<br>
సారము హంసకు మాన్ప జాలునే'

అన్నటలో హంసకీర్తి గొప్ప దని రుజువగుచున్నది

ఈవిధంగా కవులు కలాలలో చిత్రితమైన కలహంస కావ్యాలలో కావలసినంతగా ప్రశస్తిని పొందింది

గానకయే శకుంతలతో 'దుష్యన్తం ఆక్రన్దస్వ' అని పరిహసించును ఆదియే సరియైన సమయ మని ఎంచి దుష్యంతుడు వారి ఎదుటికి వచ్చును (ఇటపాత్రప్రవేశసూచనము) ఇట్లు జరిగిన హఠాత్సంఘటనకు వారు భ్రమ చెందినను వెంటనే మర్యాదోచితముగా రాజునకు అతిథిసేవలు చేసిరి తర్వాత శకుంతలా జన్మవృత్తాంతమును విగోరిన రాజునకు శకుంతల తల్లి అప్సరసయైన మేనక యనియు తండ్రి విశ్వామిత్రు డనియు చెప్పుదురు శకుంతలకు గూడ రాజును చూచినవెంటనే మనోవికారాది సాత్త్విక భావములు కల్గినవి అచ్చట చాలసేపు నిలువలేక సిగ్గుచే పోబోవును చెలికత్తెలు పోనీయరు ఈవిధంగా వారు ఒకరిపై నొకరు రాగానుబద్ధులై విరహవేదనకు గురియగుదురు దుష్యంతు డిదియంతయు చెలికాడైన మాధవ్యునితో చెప్పుకొనును.

వసుచరిత్రయందు —

రాజుకోరికను నర్మసచివుడు వారి చెంతకు మాయామునివేషముగ జని మంజువాణి యను చెలికత్తెచే గిరిక జన్మవృత్తాంతము తెలిసికొనును తర్వాత గిరికను 'ఓయనన్య కన్యా సామాన్య లావణ్యప్రభావసువల్లభుం బెండ్లియాడు' మని దీవించి తన మంత్ర ప్రభావముతో వసురాజును పిలుతునని 'మజ్ఝా' యనును

మ॥ ఇది సందింపగ వేళయంచు వసురా
జేంద్రుడు నీరంధ్రనీ
...
స్మదభృంగీరుతివండమాగధ కథా
మాధుర్యముం దెల్పగన్ ॥

ఇట్లు వసురాజు పొదలమాటున నుండి వారి యెదుటికి వచ్చును ఇచ్చట నర్మసచివు (మాయాముని)నిచే పాత్రప్రవేశకము చేయించినాడు.

చ॥ అనుపమకాంతివైభవస
మన్వితు డావసురాజుగాంచి ప
ద్మిని సరసాంతరంగమున
మించె వినూతనరాగకందళం
బొనరెనఖండవాసనలు
నుత్కలికల్వెలసిల్లె నల్లన
ల్లనఁ గిడెం బ్రమోదతరళస్థితులై
తమిఁజూపు లిమ్మెదల్ ॥

వసురాజును చూచినంతనే పద్మినీజాతి స్త్రీయైన గిరిక ముగ్ధ గాబట్టి ఆమె సరసాంతరంగమునందు అనురాగము కలిగెను రోమాంచము మొదలగు సాత్త్విక భావములు కలిగెను తర్వాత శంక, భయము మొదలగు సంచారిభావములు కలిగెను ఈవిధముగా నామె యందు ఒక్కసారిగా పొడకట్టిన సాత్త్విక భావాదులచే ఆమె వణకిపోయెను ఇచ్చట వసురాజు ఆలంబన విభావము ఆతని తేజస్సు (అందము) ఉద్దీపనవిభావము శృంగారమునందు మొదట నాయికా నాయకులకు నేత్రోత్సవము జరగిన తరువాత వారి భావిశోభనమును తలచుకొని ఒండొరులపై అనురాగము పెంపొందించుకొందురు ఇచ్చటను అదియే చెప్పబడినది శకుంతలవలె గిరికగూడ చెలులతోగూడి అతిథి మర్యాదలు జరపిన తర్వాత అచ్చట చాలసేపు నిలువలేక మేఘమనెడి తెరచాటునకు విద్యుల్లత యను స్త్రీపోయినవిధముగా తెరచాటునకు పోవును అటుపిమ్మట కలహంసి వచ్చి గిరికను పూజార్థమై తీసికొని పోవును

'రారమ్మనఁ గోమలికచ, భారమ్మున
దొరగఁ జనఁ దివురుటయున్ ॥

అట్లు చెలికత్తె ఆమెను చేయిపట్టి తీసుకొని పోవుచుండగా వెనుదిరిగి చూచుచు పోవును చెలికత్తెలు వసురాజుతో శాకుంతలమునందువలె మహా వల్లభ మాచెలిమీది ప్రేమ నీకనమున బాయకుండు'మని చెప్పి వెడలిపోదురు

శకుంతలా దుష్యంతులు ఒకరిపై నొకరికి కల్గిన యనురాగముచే విరహవేదనకు గురియగుదురు. శకుంతల విరహతప్తురాలై చెలికత్తెలచే మాలినీతీరమునందు గల పొదరింటిలో శిలాపట్టముపై నుంచబడి శీతలోపచారములు చేయబడుచుండెను దుష్యంతుడు ఇదియంతయుపొదలమాటు నుండి కని వ్యథనొందును శకుంతలచేత ఒకచివురుటాకుపై కొనగోటితో నొక మదలేఖ వ్రాయించి, దుష్యంతునికి పూలతోసహా అది యిత్తురు తరువాత ఇద్దరు కలిసికొనిరి ఆతడు శకుంతలను ముద్దాడబోవగా గౌతమివచ్చి శకుంతలను పూజచేయుటకై పిలుచుకొనిపోవును, ఆవిధముగా శకుంతల మరల చూచుచు పోవుచుండగా, దుష్యంతుడు ఆనందమును దుఃఖమును సమముగా ననుభవించును అప్పుడు చెలులు తమ చెలియైన శకుంతలపై ననురాగముఁ బాయకు మని చెప్పి వెడలిపోవుదురు ఇచ్చట శకుంతలా దుష్యంతుల ద్వితీయసమాగమము తర్వాత శకుంతలను తీసికొనిపోవుట రాజు అంతఃపురముఁ జేరి-తర్వాతమరచి కొన్ని రోజులకు శకుంతల రాగా తిరస్కరించి, శకుంతల తనభార్యయే యని తెలిసిన తర్వాత మరల విరహవేదనము ననుభవించుట జరగును వసుచరిత్రయం దట్లుగాక ప్రథమసమాగమము తర్వాతనే ఇద్దరు ఒకరిపై నొకరు మరులుగొని విరహవేదనకు లోనగుదురు

దుష్యంతుడు శకుంతలను తనభార్యగా తెలిసికొనినది మొదలు రాచరికపు వ్యవహారములు చక్కగా నిర్వర్తించకుండును అన్నపానాదులను వేళకు గైకొనడు చెలులు వచ్చి భోజనవేళయైనది లెమ్మనగా చలించకుండ ఉండిపోవును అంతఃపురోద్యానవనమునకు చెలికానితో గూడి పోయి అంతకుముందు సగముగీసిన శకుంతలా చిత్రపటమును పూరించుటకుఁ బూనుకొని దానిలో శకుంతల నూహించు

కొని ఆపటముతో మాట్లాడుచుండును ఇచ్చట ఉన్మాదమను సంచారిభావము చెప్పబడినది

వసుచరిత్రయందు —

వసురాజు గిరికను వీడినది మొదలు దశవిధావస్థలలో చిక్కి మరని బాధను గురియగును ఉద్యానవనమునందు దేనిని చూచినను గిరికయే యని భ్రమించి పట్టుకొనబోవును

సీ॥ 'కనుగొంటిలతకూన నని డాయుఁ
గాకున్న, నభినవతరలతావాప్తి దెలుపు'

ఇచ్చట ఉన్మాద మను సంచారిభావము చెప్పబడినది

ఈ విధముగా వసురాజు విరహానల తప్తుడై పడియుండగా మంజువాణి వచ్చి చాటునుండి విసిరిన ముత్యాలహారము నందు గిరిక నూహించుకొని వ్యథ నొందును

శాకుంతలమునందు —

దుష్యంతుడా విధముగా పిచ్చివాని వలె శకుంతలా చిత్రపటముతో మాట్లాడు చుండగా మారీచ మహర్ష్యాశ్రమములో శకుంతలకు చెలికత్తెగా నియమింపబడిన సానుమతి రాజును చూడగోరి గగనమార్గమున వచ్చి దుష్యంతుని అవస్థను చూచి వెంటనే పోయి శకుంతలకు వివరించినది అక్కడ రాజు శకుంతల చిత్రపటమును మిగిలిన సగము పూరించుటకు పూనుకొని నాడు. కాబట్టి ఆయన శకుంతలను మరల స్వీకరించుటకు పూనుకొనినాడని సానుమతి మదియందు తలపింపజేయును

వసుచరిత్రయందు —

మంజువాణి తన చెలి కష్టములను రాజునకు విన్నవింతమని గగనమార్గమున వచ్చి రాజును విరహావస్థలోఁ జూచి గిరిక ముత్యాలహారమును అతని కిచ్చి కొంత ఉపశమింపజేసెను వసురాజు గిరికను నిందావచనములు పలుకగా మంజువాణి 'అనన్యగతిన్ సుదతిన్ మనోజబారికి నెరఁజేసి లోఁగనికరింపని వారివిగాక నేరములే' అనియు 'మహీపాలుర్మహావైభవ శ్రీయోగాంధులు సెప్పనేల మగవారిన్ నమ్మగావచ్చునే' యనియు ఎదురు దెబ్బతీయును తరువాత గిరికాదేవికూడ తన యవస్థలోనే యున్నదని గ్రహించిన రాజు తన యుంగరమును గొనిపొమ్మని మంజువాణి కిచ్చును ఆమె అది కొని పోయి గిరికవ్రేలి నుంచి తాపోపశమనము కలుగఁ జేయును

శకుంతల వృత్తాంతమును రాజునకు చెప్పునపుడు తల్లిదండ్రుల ప్రసక్తి వచ్చినపుడు తల్లియు దండ్రియు కణ్వమహర్షియే యని కవి చెప్పించినాడు గిరిక తను విరహమునను భవించునప్పుడు త్వరగా వివాహము జేయుటకు తనకు తల్లిదండ్రులు నామమాత్రులే యని ఆమెచే తలపోయించినాడు. కణ్వుడు శకుంతలాదుష్యంతుల గాంధర్వ వివాహము తన దివ్యదృష్టితో తెలిసికొని ఒక శుభలగ్నమున శకుంతలను అత్తవారింటికి పంపదలంచును అప్పుడు తల్లిదండ్రులు తమబిడ్డను మొట్టమొదలు ఎట్లు ఆమె భర్తవద్దకు సకల లాంఛనములతో పంపుదురో ఆ విధముగా పసుపుకుంకుమలతో నూతన వస్త్రభూషితగా జేసి లాంఛనయుక్తముగా ఆమె వెంట నిద్దరు శిష్యుల నిచ్చి పంపును అత్తవారింటిలో ఏ విధముగా నడచుకొనవలయునో భర్తయెడల ఎట్లు మెలగవలయునో అన్నివిధముల బిడ్డకు బుద్ధులు గరపి మహర్షియైనను ఏదో విడరాని బంధము ఆబిడ్డతో నున్నట్లు లోలోన కించిద్వ్యథ నొందును అయినను బిడ్డ అందులో వివాహమైనది ఎన్నిరోజులు తల్లిగారింటిలో నుండును ఎప్పుడో ఒకప్పుడు వెడలిపోవలసినదే కదా! యని తన మదియందు గనుకొని తండ్రిని విడిచిపోలేక ఏడ్చుచున్న శకుంతలను ఓదార్చి రాజుతో చెప్పవలసి విషయములు శిష్యులకు జెప్పి వారిని సాగనంపును

చిన్ననాటినుండి ప్రకృతి ఒడిలో పెరిగినది కాబట్టి పక్షులను, తరువులను, తన తోబుట్టువులనుగా భావించి ప్రియంవదానసూయలను చివరిసారిగా గాఢాలింగనము చేసికొని తిన్నగా వెడలును రాజామెను తిరస్కరించుటయు, ఆమె మారీచ మహర్ష్యాశ్రమమున నుండుటయు జరుగును కొన్ని దినములకు రాజునకు శకుంతలచే పోగొట్టబడిన ఉంగరము దొరకిన తర్వాత శకుంతల తన భార్య యని తెలిసి తర్వాత ఒకనాడు స్వర్గము నుండి తిరిగి వచ్చుచు మారీచాశ్రమమును దర్శింపగోరి యాతడచ్చట దిగెను ఆ యాశ్రమమున తన పుత్రుని, శకుంతలను గని సంతసించి మారీచ మహర్షి సమక్షములో తన తప్పును ఒప్పుకొని శకుంతలను ఓదార్చి వారివద్ద సెలవు గైకొని దారాపుత్రులతో నిజపట్టణమున కరుగును.

వసుచరిత్రయందు –

ఆవిధముగా మంజువాణివలన వసురాజు సంగతి తెలిసికొని అతడు పంపిన యుంగరమును తన కేల ధరించి తాపశాంతి నొందెను ఇదంతయు విన్న గిరిక తల్లియైన శుక్తిమతి తన బిడ్డకు కలుగు భావి ఔన్నత్యమును గురించి మెచ్చుకొనెను అతర్వాత ఇంద్రుడు సకలదేవతా పరివారముతో కోలాహలునివద్దకు వసురాజు తరఫునవచ్చి గిరికా వసురాజులకు వివాహము నిశ్చయించెను ఒకశుభముహూర్తమున గిరిక తల్లి శుక్తిమతీ పరమైన నదీ కాంతాబంధుజనులు కోలాహలుని పరమైన పర్వతశ్రేష్ఠులు హిమవంతునితో సహా సకలదేవతా, పర్వత నదీ పరివార సమక్షములో లాంఛనయుక్తముగా గిరికా వసురాజులకు వివాహ మొనర్తురు పిమ్మట బిడ్డను తల్లిగారింటినుండి అత్తవారి ఇంటికి పంపవలయును ప్రథమ సంతానము

(తరువాయి 1 వ పేజీలో)

# 6. అద్దేపల్లివారి కవితా హాసము - ఋతువిలాసము

- శ్రీ జి బి ఎస్. ఆచార్య, ఎం ఏ, పి హెచ్ డి

( గతసంచిక తరువాయి )

ప్రకృతియొక్క ద్వితీయ విలాసము గ్రీష్మము దీనిని వర్ణించటంలో కవిగారు ప్రదర్శించిన ఔచిత్యాన్ని చమత్కార చారుత్వాన్ని పరిశీలిద్దాం

'ఏకతమున రేల నైక విప్పని యింతి
పైటయే వేయదు పట్టపగలు
వాల్గదీములైన స్నానంబె చేయని
యతడు ముప్పూటల నాడుజలము
ఒడ్లెల్లనిండుగా నడుపుల దాల్చువాడు
డంగవస్త్రము గట్టు నహరహంబు
నెలరైన మేనిదుస్తులు మార్చదలచని
యతడు పూటకు రెండు జతలుమార్చు
నెలలతరబడి క్షురకర్మ దలపనట్టి
యొడ్డయైనను నెలకు జేయించుకొనును
రెండుపర్యాయములు బట్టనుండుచున్న
నైజమున్ మార్చు నీగ్రీష్మరాజు చూడ!'

అని గ్రీష్మరాజు యొక్క ప్రతిభను వర్ణించారు మానవప్రకృతికంటె ఋతుప్రకృతియే బలీయమైనదని ప్రతిపాదించే లక్ష్యం ఈ పద్యంలో ద్యోతకమవుతున్నది 'ఏకతమున రేల' అనేపాదంలో చమత్కారంతోపాటు, స్త్రీ సహజమైన సిగ్గునుకూడా ఋతుధర్మం మాన్పించినదని దాని ఆధిక్యాన్ని ధ్వనింపచేసారు. ఇలాగే మిగిలిన పాదాల్లోకూడా చమత్కారమూ, ఋతుధర్మమూ పెనవేసుకుని ఆస్వాదయోగ్యంగావున్నాయి. ప్రకృతి ధర్మాలకు అనుగుణంగా, మానవ జీవనవిధానం ఎలామారుతూ వుంటుందో ముచ్చటగా తెలియజేసిన ఈపద్యం కవిగారి నిశితపరిశీలనదృష్టికి మచ్చుతునక. ఇంకా 'నైదాఘ' మహిమను వర్ణిస్తూ -

'కుడుచుటకు మున్నె నీరమున్ గ్రోలికూడు
సైప లేదని కుందెడు జనుడొకండు'

అని వేసవికాలంలోని 'దప్పిక'ను- దానివలన కలిగే అవస్థాన్ని సూచించారు. ఇది మానవజీవిత సన్నిహితమైనది. మన స్వత్వ పరిశీలనకు సంబంధించినది

'పృథివి నైదాఘమహిమ వర్ణింపదరమె!' అనే పాదంలో 'నైదాఘ' అనేది గ్రీష్మానికి పర్యాయపదమైన 'నిదాఘ' శబ్దభవము, 'నితరాందహ్యతే జనోఽత్ర నిదాఘః' (జనము దీనియందు మిక్కిలి దహింపబడును, కాన నిదాఘము) అని అమరము

కవిగారు ఔచిత్యం పాటించి 'నైదాఘ' శబ్దాన్ని ప్రయోగించి, ఎంతో ప్రయోజనాన్ని సాధించారు గ్రీష్మ ఋతువులో మానవులను బాధించి, మిక్కిలి చికాకు కలిగించేది స్వేదము దీనిని కవిగారు 'స్వేదము' అనే శీర్షికలో సుదీర్ఘంగా వర్ణించారు

'అళికంబునందున్న తిలకంబు నుంచవు
పెట్టనేలే దనితిట్టు మగడు
వంగివడ్డించెడువాని చేతులజాతి
పడెదు వానిందిట్టె బంక్తిజనము
తర్జనితో నొసల్ మార్జన మొనరింప
బ్రక్కదూలుదు దూయు భార్యపై స్త్రీ
అలిగి యుసకు నాటంక మొదవింతు
వాడపోయెదు రెప్పడాలుమగలు
స్వేదమా! మోదమా లేక ఖేదమా? వి
నోదమా! తుందుడుకుదనంపు ఖేద మొదవ
జేయుచుందువు నిచ్చలు జేతిలోని
విసనకఱ్ఱల కేళాని వినవు మాట!'

అని యెంతో చమత్కారం పుట్టిపడేట్లు స్వేదబాధను వర్ణించారు 'స్వేదమా!' అని స్వేదాన్నే సంబోధించి ప్రత్యక్షంగా దానిచేష్టలను దానికే నివేదించటం చమత్కారంగా వుంది ఈ పద్యంలో కేవలం చమత్కారమేకాదు సంప్రదాయసౌలభ్యంకూడా వుంది.

'అళికంబునందున్న' అనేపాదంలోవున్న సంప్రదాయధోరణి గ్రహించవలసిందిగా వుంది నదుటబొట్టు పెట్టుకోటం హైందవసువాసినులకు అతిముఖ్యమైన విషయం బొట్టులేకపోవటం అశుభసూచకం అత్తలో, ఆడుబిడ్డలో తిట్టటంగాదు-మగడే తిడతాడని వర్ణించబడింది తనభద్రతను గూర్చి తానే జాగ్రత్త వహించటంలో సమంజసత్వం వుంది

'ఆలింగనమునకు నాటంక మొదవింతు.' అని శృంగార రసాభాసాన్ని కలిగించే స్వేదాన్ని ఆలుమగలచేతనే ఆడిపోయించారు ఇంకా ఘర్మబాధను తట్టుకోలేక పచ్చడములు, దుప్పటులు, శాలువలు మొదలైన ముసుకవసాలను విస

( 11 వ పేజీ తరువాయి )

శుక్తిమతీ కోలాహలులకు కల్గిన ముద్దుబిడ్డ చాలా గారాబముగా పెంచి పెద్ద చేసినారు అయినను ఏతల్లిదండ్రులు తమ బిడ్డను అత్తవారింటికి పంపక యుందురు? తన బిడ్డ అత్తవారింటిలో ఏవిధముగా నుండవలయునో చెప్పి శుక్తిమతి బిడ్డనోదార్చును అల్లుడు మహారాజు, అక్కడ అన్నివిధములా వానికి దగినట్టు నడుచుకొనవలయు నని తండ్రియైన కోలాహలుడు చెప్పును ఈవిధముగా వారి బిడ్డకు అన్నివిధములా బుద్ధులు గరపి వసురాజు వెంట పంపుదురు

ఈవిధముగా రామరాజభూషణుడు తన వసుచరిత్రను నాటకీయ శైలిలో రచించి కాళిదాస శాకుంతలమును అనుసరించి నప్పటికి అన్నివిధములుగా పటిష్ఠముగా రూపొందించి తరువాతి కవులకు కూడ మార్గదర్శకుడయి ప్రౌఢబంధముగా ప్రఖ్యాతి నొందించెను

ర్జించి, సన్నని వస్త్రాలనే ధరింతు రని మహోష్మమూ, భీష్మమూ అయిన గ్రీష్మాన్ని వర్ణించారు మిగిలిన ఋతువుల కంటె ఈ ఒక్క గ్రీష్మఋతువులోనే, బావులలో నీటికి చేత్రాడు చాలకపోవ టం, భోజన సమయాల్లో నీరు త్రాగడా నికి మరచెంబుచాలకపోవటం, ఏరులలో పడవలు నడపటానికి లోతుచాలకపోవ టం మొదలైన 'హ్రస్వ'గుణాలు వున్నా యని, దాని వింతలక్షణానికి అచ్చెరు వొందారు

'సందెవార్చునెపాన జలపానకాంక్షచే
మాటిమాటికి నాచమనము సేయు
చల్లదనమ్ముఁ దా నుల్లమ్మునన్ గోరి
మడియన్న మిషఁ బంచఁ దడిపికట్టు
జందెపుఁజిక్కులు సవరించు వ్యాజానఁ
బేలినవీఁపెల్ల విరియగోకు
మైలపడిన యనుమానంబు నటియించి
తపమేదఁ బలుమాఱు తానమాడు
శ్రోత్రియుం డొక్కరు డతండు
చూచువారి
కన్నుల కమాయికం డట్లు కానఁబడును
హృదయగతమైన భావంబు నెవ్వఁ
డెఱుఁగు
గ్రీష్మ మది ఛాందసునకైనఁ గిటుకునేర్పు

అని శ్రోత్రియునిఇనుమడించిన శ్రోత్రి యతకు చమత్కార పూర్వకమైన వ్యాజాలను సూచించారు ఇందులో వ్యంగ్యంగా, సునిశితంగా హాస్యం తొంగి చూస్తున్నది

'తాళశిరంబులందు, మఱి
తాళఫలంబుల ముంజెలందునన్
నాలికెడంబులందునను,
నా జెపుఁదక్రమునందు, డాఁగెఁ గీ
లాలముగ్రీష్మరాజుముఖ
రౌద్రము సైపఁగలేక, దానినే
గ్రోల నెఱింగిరో జనులు
ప్రీతిగ్రహింతురు తద్రసంబులన్ !

అని వడదెబ్బకు వుపశమనాలైన పదార్థా లను ప్రస్తావించారు గ్రీష్మరాజు ముఖ రౌద్రము సైపలేక 'కీలాలము' (నీళ్ళు) ఆయావస్తువులలో దాగుకొనిన దనుట కవిగారి చమత్కారం ఎంతటిభాగ్య వంతుడైనా కటికదరిద్రునిగా మార్చ గలశక్తి గ్రీష్మానికి కల దని చెపుతూ ఈక్రింది విధంగా వివరించారు

'పట్టెమంచంబుపైఁ బవ్వళించెడువాఁడు
కటిక నేలయె మేలుగాఁ దలంచు
ఉష్ణోదకస్నానమొనరించు నాతండు
చన్నీటిమునక ముచ్చటగ నెంచు
సౌధాంతరంబున శయనించు నాతండు
రేల నార్బయల నిగ్గింపఁజూచు
మేడలన్ మిద్దెలన్ మెలఁగునాతండు తా
టాకుపాకయెసౌఖ్యమనుచుఁదలఁచు
మంచిదుస్తుల ధరియించుమనుజుఁడొకరుఁ
డెంచుఁ గౌపీనమే యోగ్యమంచునిపుడు,
భువి నిరాడంబరత్వంబు బోధ య
వచ్చు నీగ్రీష్మ మని చెప్పవచ్చునిజము !'

భువిలో నిరాడంబరత్వాన్ని చాట టానికే ఈగ్రీష్మం వస్తుం దని సంభావిం చటం ప్రశస్తంగా వుంది. ఇంకా ఈ ఋతువులో, సెగగడ్డల ముఖాలు, పేలిన వీపులు, జుగుప్సాకరంగా వుంటాయనీ, నేలంతా ఎండిపోయి బీటలువారి పచ్చిక లేకపోవటంచేత పశువులు సమృద్ధిగా పాలీయ వనీ వర్ణించారు ఇంకా ఈ ఋతువులోమంచినీటిని, మజ్జిగను, నిండు వాహినులను, ఎండమావులను, 6 మొగు లులను, కార్చిచ్చుపొగలను, నీరసమును, నిద్దురను విశ్లేషించి చూపలే మనుమ గ్రీష్మం కలిగించే'భ్రాంతి'ని వివరించారు

'మంచుగొండవసించు నుమాధవుండు
మహితకలశాబ్ధిఁ బవళించు మాధవుండు
నీరజమునందె యుండుఁ వాణీధవుండు
గ్రీష్మతాపము సైపంగ లేకకాదె ?' 7

దేవతలను సైతం కలవరపెట్టే గ్రీష్మ తాపాన్ని చమత్కారంతో వర్ణించటం పైపద్యంలో కనిపిస్తున్నది ఉమాధవుడు, రమాధవుడు కలశాబ్ధిలో పవళించు టకు, వాణీధవుడు పద్మాసనుడై యుండు టకు గ్రీష్మతాపమే కారణమనుట ఇందలి చమత్కారం సాంప్రదాయికమైన విషయ వర్ణనతోపాటు, పూర్వకవివర్ణన ను స్ఫురింపచేస్తున్న ఈ పద్యమొక ఆణిముత్యం కవిగారు మిక్కిలి ప్రతిభా వంతంగా భీష్మగ్రీష్మవర్ణనను పూర్తిచేసి వర్ష ఋతువర్ణన పద్యమించారు

వసంతఋతువులో వసంతలక్ష్మీ మాధ వుల కల్యాణంవలె ఈఋతువులో శ్రావణ లక్ష్మీ జలధరరాజులకు మహావైభవోపే తంగా వివాహం జరిపించబడింది పెండ్లి తంతు అన్నీ చాలావరకు పూర్వంవలే జరిగాయి తగిన యేర్పాటు లన్నింటినీ 'వరుణరాజు' ఘనంగా సమకూర్చాడు శ్రావణలక్ష్మి అందచందాలను వర్ణించిన తీరు శ్లాఘాపాత్రమై యున్నది

'వధువుశ్రావణలక్ష్మి భావజునిరాణి
గెల్చులావణ్యరాశి, సుకృతి, గుణాఢ్య,
నవతటిల్లత మేను, వర్ణము సేయ
నెవరతరమాను, భువనమోహినియెసుమ్ము,
వికసితాబ్జము మోము కన్నెందు సేయు
అలితమూ మోవిబింబతలమ్ము నమ్ము,
గండుమీ అవి కన్నులు, కాఱుకొన్న
యిరులు కురు లగు, జక్కవలేపుఁజూపు
బటువుగుబ్బలు, మిగులజెల్వమునవొప్పు
తతనితంబంబుపైనఁ జిత్రంబునడుము,
నవగభీరజలావర్తనంబు నాభి
జలతరంగాలు పొట్టపై వళులునుమ్ము'

ఈ వర్ణనలో వర్ష ఋతుశోభ కళ్ళకు కట్టించిన నేర్పు మెచ్చదగినది ఇంకా అంబరమే తెరపట్టు అంబరము, చాత కాలే సభ్యులు, స్తనితనినదాలే మంగళ వాద్యాలు, దుర్దురోత్కరభాషలే వేద ఘోషలు 5 అయి వివాహం మిక్కిలి సంరంభంతో జరిగింది వసంత ఋతువులోవలే ఇక్కడకూడా యాజ్ఞి కుడు 'సమయమే' సూత్రధారణ తరు వాత నవదంపతులు 'జలబిందురమ్యముక్తా

పాళి'ని దోసిళుల నింపి తలంబ్రాలను పోసుకున్నారు ఆ దంపతు లిరువురు సీతారాములవలెను, రుక్మిణీకృష్ణులవలెను సుభద్రార్జునులవలెను తోచినా రని కవిగారు వర్ణించారు. ఆదర్శ వంతులైన పురాణ దంపతులను ఉపమానంగా గ్రహించటం కవిగారి వైలక్షణ్యాన్ని చాటుతున్నది వరుడైన జలధరుడు నల్లగా వుండటంచేత కొందరు అమ్మలక్కలు అసంతృప్తితో 'కాకిముక్కున కొం దొండఁ గట్టి రేమె?', 'ఈకుఱోడైన నొక యింత చూడరాదె?' అని పలుకగా మరికొంతమంది 'వరుడు నల్లనైన సద్గుణాకరుడు, ఘనుడు, సాటిలేనట్టి నెఱదాత, మేటిజోదు, పురుషునకు రూప మేటికే? బుద్ధిబలయి' అని పలికి సమర్థించారు. 'ఒకనికిన్ గంపు అదియ వేఱొకని కింపు' అని పెండ్లిసందడిని చిత్రించటంలో - సామాన్యంగా జరిగే లోకవ్యవహారాన్ని చక్కని లోకోక్తులతో తెలియజేసారు. ఇది ఒకవిధంగా మానవ మనస్తత్వ చిత్రీకరణమని చెప్పవచ్చు 'ఘనుడు' అని ప్రయోగించి మేఘుడనే స్ఫురణనుకూడా కలిగించారు. నీటినివర్షించి దానంచేసేవాడు కాబట్టి 'సాటిలేని నెఱదాత' అనటంలో ఎంతో సముచితత్వంవుంది.

ఈవిధంగానే 'మెరపులు' అనే ఖడ్గాలుకలవాడు కాబట్టి 'మేటిజోదు' అని ప్రయోగించి వుంటారు.

'ఇంద్రధనువను పల్లకి నెక్కి నూత్న
దంపతులు పుర మేగు నుత్సవమునందు
మెఱుపులే 'లైట్లు', పిడుగులే మేలి 'బౌట్లు'
ఉఱుములే పెక్కువాద్యాల యులివు
లయ్యె'

పైపద్యంలో 'ఇంద్రధనువను పల్లకి' అనే శబ్దచిత్రం మనోహరంగా వుంది. 'లైట్లు', 'బౌట్లు' అనే ఆంగ్లపదాలను చక్కగా పొదిగి నవ్యతను సాధించారు.

'గొంగళు లను గోడవిప్రులు' అను లనుకూడ చప్పగా నాకివైచి భోజనము చేసినా రని చమత్కరించారు. (గోడ బ్రాహ్మణులు మంచి భోజనపుష్టికలవా రని ప్రతీతి)

'వానకాళ్ళు' అనే శీర్షికతో వర్షధారలను చక్కగా వుత్ప్రేక్షించారు

'నింగిబిందెపు మబ్బునీలివస్త్రముఁ జుట్టి
అమృతంబువడఁబోసి రమరు లనుచు
గగనసరస్సున మొగులుమించును గూడి
జలకమాడఁగఁ బడ్డజల్లులనుచు
ప్రకృతికాంత తలఁటునకు నమృతము
మించుఁ
బొలఁతులం గొనివచ్చి పోసిరనుచు
పానీయమేమాను పాదపమునితతి
పైఁగురియు పూలవానయట్లు
వేసఁగిని దన్నుగూర్చి తపించినట్టి
భూజనులఁ గాంచి వేడ్క శంభునిశిరాన
నున్న గంగమ్మ తా నెన రూనియెల్ల
వరములిచ్చుటగా నెంతు వానకాళ్ళ!'

అని సహజసుందరంగా వర్ణించారు. వర్షఋతుస్వభావాన్ని ఆలంకారికంగా చెప్పటం పైపద్యంలో గమనించదగిన విషయం వర్షధారలను గంగమ్మ ప్రసాదించిన వరాలుగా సంభావించటం సమున్నతమై, కవిగారి కల్పనాచాతుర్యాన్ని చాటుతున్నది

'మబ్బుపూఁబొదరిండ్లు', 'వ్యోమపయోరాశి', 'అబ్దఘటములు', 'ఆకాశవిపినము', 'అభ్రవేదండాళి' మొదలైన రూపకాలు రమ్యతరాలై, దృశ్యసాక్షాత్కారశోభను కలిగిస్తున్నాయి

'ఆకసంబను రంగమధ్యంబునందు
లాస్యమునరించు శ్రావణలక్ష్మికట్టు
మించుసరిగంచుఁజీరఁ గన్పించు నట్టి
కుచ్చెళులయట్లు జలధార లిచ్చఁదోఁచు!

అని జలధారలను సంభావించిన తీరు కవిగారి భావనాబలానికి ప్రబలనిదర్శనం.

'ఆంతర్యము' అనే ఖండికలో, వర్షఋతువులో రెండుపక్షాల పెండ్లివారికి కలిగే లాభాలను సునిశితహాస్యంతో చమత్కరించారు.

'బందుగులందు నెవ్వరు రారులే యని
వానకాఱును గోరు వధువు తండ్రి
పురమేగ వాయిదంబులు పల్లకీ 'లైట్లు'
కరుచుతగ్గుట నెన్ని వరునితండ్రి
రుబ్బిపెట్టుటెగాని మబ్బులన్ మాయలు
వడియాలవడ్డను వధువుతల్లి
తడిసిపాడౌను క్రొత్తది సుమ్మి యనిచీర
మడతవిప్పదు పెండ్లికొడుకుతల్లి
వాన కాగునె వేసి లాభంబె యంచుఁ
బొందిరియె చేయఁజూడఁడు వధువుతండ్రి
వానకాలపు మేలుసంబరమె లోన
పైకిమాత్రము చెప్పఁడు పల్కు వేఱు!

అని వధూవరుల తల్లిదండ్రుల మనస్తత్త్వాలను బట్టబయ లొనరించిన కవిగారి నిర్మొగమాటాన్ని మెచ్చుకొనవలసినదే. ఇంకా వర్షఋతువులో సమృద్ధిగా కనిపించే కూపజలాలను, చేపకోలనులను, కప్పలనదులను ప్రస్తావిస్తూ—

'తిప్పలు కూలినాలికయి
త్రిమ్మరునవ్వల కెల్ల నప్పపా!'

అని పేదవారిపై సానుభూతిని చూపించారు. 'జయవాసరము' అనే శీర్షికతో శ్రావణమాసమందలి పేరంటాలను, స్త్రీల స్వభావాలను చక్కగా అద్దంపట్టి చూపారు.

'ఏయింటివాయనం బాయింట నేతిని
మూటమోయని నీటుబోటి యొకతె
ఎరువుసొమ్ములఁజూచు నెవరేని నెంతన
మూతి ముటకరించు నాతియొకతె
ఈనాల్గుగింజల కింతదూరము పడి
వచ్చితి మని రోయు వనితయొకతె
బోటనద్రవేళ్ళకుఁ బస్పుఁబూసినఁజాలులే
చీరపాడగు నంచుఁ జెలువయొకతె

చంటివెంటయుఁదనతోడఁ జాఁగిరాఁగఁ
జెలఁగిపిల్లలకోడి వచ్చెడివిధాన
వచ్చునొక్కతె కన్నులపండువగును
శ్రావణంబున జయవాసరంబుడంబు !'

పిల్లలుగల స్త్రీని పిల్లలకోడి' తో వుప మించటం లోకవ్యవహారానికి మిక్కిలి సన్నిహితమై వుంది. ఇంకా పయోధయ నుద్దేశించి, కొనియాడుతూ ఆతనివుదాత్తమైన దాతృగుణాన్ని, సమవర్తిత్వాన్ని ప్రస్తావించారు.

'గగనకాంతారాన ఘనమృగతతి సేయ
వేలుపుతేఁ డెక్కుపెట్టు విల్లు
ఆకాశమనెడుమిథ్యామధ్య సొగసుగా
నడుముపైఁదాల్చు రత్నాలకమరు
అంబరోద్యానంబునందు శ్రావణలక్ష్మి
లీలమైనూఁగు రత్నాలడోల
భూజనాళికిఁ జాల ముందెపర్జన్యుండు
కచ్చితమ్ముగఁ జేయు నెచ్చరమ్ము
శ్రావణేందిరకబరీభరంబుపైన
ముచ్చటగ రంగురంగుల పూలుదెచ్చి
అనువుగాఁగూర్చి గుండ్రించినట్టి చెండు
కరణి నింద్రధనుస్సు సాక్షాత్కరించు !'

అని చిత్రవర్ణరంజితమైన శక్రాయుధ సౌందర్యాన్ని ముగ్ధమనోహరంగా చిత్రించారు. ఇందులో కొన్ని పూర్వకవుల భావానుసరణాలు కాగా, కొన్ని సర్వస్వతంత్రాలై కవిగారి కల్పనానల్పశక్తిని వెల్లడిస్తున్నాయి.

'సమతావాదము' అనే శీర్షిక క్రింద వ్రాసిన పద్యంలో కవిగారి అభ్యుదయ ధోరణి ద్యోతకమౌతున్నది.

'గమనింపం గడుబాహిరంబె యగుఁ జ
క్కన్ మిట్టపల్లంబు లే
కముగాఁ జేయుచుఁ బాఱుచున్
సలిలముల్
గన్పట్టుటల్ చూడఁగా
సమతావాదముబోధ సేయుటకు వ
ర్షర్తుప్రకాండుండె యీ
క్రమమున్ దా వెలయించెనంచు మది వ
క్కాంతంబు నూహించెదన్ !'

ఇది డా॥ సి. నారాయణరెడ్డిగారి 'వర్షాసుందరి' ౨ అనే ఖండికలోని—

'మిట్టలన్ గూడుగట్టిన మట్టినెల్ల
పల్లమునదించి, మిట్టలపల్లములను
ఏకవర్ణమ్ములోన చిత్రించిసామ్య
వాదపారము నేర్పె నీ వాననీరు'

అనే పద్యంతో పోలిక కలిగివుంది. సమకాలీనులైన ఇద్దరూ ఒకేవిధంగా, సామ్యవాదంపై గలప్రీతిని మృదుమధురంగా వర్ణించటం ప్రశంసనీయం.

'ఆఁడుమగయనుమాట రవ్వంతయైనఁ
బాటిసేయవు, పంటకాల్వలను దాఁట
గోపికలకెల్లనాఁడు ముకుందునట్లు
సిగ్గునంతను బోగొట్టి చేర్తువాడ్డు
కనికరములేదె ఓ వానకారుప్రోడ !'

అని చమత్కారంతోపాటు, పౌరాణిక స్ఫూహనుకూడా కలిగించిన కవిగారు వుత్తమ సంప్రదాయాలకు వారసులని స్తుతించాల్సివుంది. భారతీయులు పరమాణువులోకూడా పరబ్రహ్మస్వరూపాన్ని వీక్షించగల భావుకులనటానికీ పద్యం నిదర్శనంగా వుంది ఇంకా వర్షాకాలంలో కలిగే అనేకాలైన చికాకులను వివరించారు ఇల్లాలు వస్త్రాలు ఆరలేదని చాకితతో జగడమాడటం, భోజనాన్ని పెందలకడనే వడ్డించలేదనిభర్త భార్యపై ఎగిరిపడటం, పొయ్యి మండలేదని అతివ అగ్నిపై ఆగ్రహించటం, మొదలైన ఎన్నింటినో పూసగుచ్చినట్లువర్ణించి, వీటన్నింటికీ హేతువు 'వానకారుప్రోడ' యే అని తెలియజేసారు.

'పాడి కోరువఁగాఁగల మిఱఁ
దడికోరువఁ జాలమంచు ధాత్రిజనంబుల్
నుడివెడు పల్కులె మన క
క్కడనున్న వినంగ వానకారున
నెపుడున్ !'

అని వానకారు వర్ణనను ముగించారు.

(సశేషం)

---

6. 'గ్రీష్మేపాటల మల్లీతాపసరః
పథికశోషవాతోల్కాః
సక్తుప్రపాప్రపాస్త్రీ
మృగతృష్ణామ్రాదిఫలపాకాః'
(పుట. 42 శ్లో 30)

అని 'కవికల్పలత' గ్రీష్మఋతులక్షణాన్ని నిర్వచించింది.

7. 'కవికర్ణ రసాయనము'న గ్రీష్మవేళ, దుర్భరమైన వేసవివేంద్రానికి తాళజాలక దేవతామూర్తులు పొందేభావాలను 'సంకుసాల నృసింహకవి'హృద్యంగా వర్ణించాడు.

'ఏకార్ణవంబులో నిరవైనవటపత్ర
శయనంబుమదిఁ గోరె శార్ఙ్గపాణి
యష్టమూర్తులలోన నంబురూపమునాత్మఁ
గాంక్షించె హరిణాంకఖండమౌళి
ప్రథమాంబుజఘ్రాణ భావస్థితియ వేఁడి
యభిలషించెఁ బయోరుహాసనుండు
వేడ్కగాఁకుండియు విలయోదకోదర
స్థితియపేక్షించె ధాత్రీవధూటి
హేమ రజతాచలాది మహీధరములు
హిమగిరిత్వంబు మతుల నూహించుకొని
సకలలో కానివార్య దుస్సహ మహోష్ణ
భీష్మగతియైన యమ్మహాగ్రీష్మ వేళ''.

ఇంకా 'వైజయంతీవిలాసము' నందు సారంగు తమ్మయ్య' పరమేశ్వరుని స్థానదలనాన్ని గూర్చి ఈవిధంగా వ్రాసాడు.

హారుడు కైలాసవధర నాధాగ్రవసతి విడిచి వటమూలతలమున విశ్రమించె, నతతనిజజీర్ణ తాతనూకృతి నిశా ప్రసారమగునట్టి గ్రీష్మవాసరములంగు.'

(ప్రథ ఆ. పద్య. 57)

మొదలైనవన్నీ కవిగారి పైపద్యరచనకు ప్రేరకములై యుండవచ్చు నని నా యూహ.

1. 'దుర్దురము' అనగామబ్బు' కప్పఅనే అర్థాలంకలవు ఇక్కడ వరుడు మబ్బే కాబట్టి వేదఘోష చేసేవి కప్ప లని చెప్పుకోవాలి. కప్పల అఱపులను వేదఘోషలంగా సంభావించటం కవి గారి విశిష్టతను చాటుతున్నది

సంవత్సరం శశయానా
బ్రాహ్మణా వ్రతచారిణః
వాచం పర్జన్య జన్వితాం
ప్రమండూక అవాదిషుః'
- ఋగ్వేదము - మండూకసూక్తము.

అనే శ్లోకం స్ఫురణకు వస్తున్నది.

1. శ్రీనందుల గోపాలకృష్ణమూర్తిగారు తమ 'ఋతుసూక్తము' (పుట 9) అనే గ్రంథంలో పై ఖండికను వుదాహరించారు.

# 7. భైరవుని కవితా కళ

- శ్రీ కే. కిశోరుబాబు, ఎం. ఏ
- శ్రీ కే అశోకబాబు, బి ఎస్ సి.

ఇయ్యా నేరని రండవంటి దని తిరస్కరింపబడిన ద్విపదయందు ఉదాత్త ప్రౌఢ కావ్యములను రచించి పాలకుర్కి సోమన తరువాత దానినొక వెలుగు వెలిగించి సాహిత్య లక్షణ చక్రవర్తి యై వహి కెక్కిన రాచకొండ సంస్థాన కవి గౌరన. అతని పుత్రుడే భైరవకవి తండ్రివలెనే భ్రమరాంబా వర ప్రసాదలబ్ధ కవిత గల వాడు ఉభయభాషలందు ప్రవీణుడు బహూపాఖ్యాన విఖ్యాతమై జటిల వేదాంత గంభీరమై పరగిన సాత్విక పురాణ మగు సౌపర్ణపురాణాంతర్గత భాగమునుండి మోక్షపదాధారంబైన శ్రీరంగమహాత్త్వమును గ్రహించి యాశ్వాసపంచక రసవత్కావ్యముగా తీర్చి దిద్ది యందు తీర్థక్షేత్ర దైవ మాహాత్మ్యముల మూడింటిని త్రివేణీ సంగమమువలె నిబంధించినాడు, అతడు దానిని పూర్ణ చంద్రాతపస్ఫురణ సముద్భూత దుగ్ధాబ్ధి వీచి పంక్తుల నదల్చి వెలయు విశద యశము గల చాగయ రాఘవున కంకిత మిచ్చినాడు. అతడు బహుమనీ రాజ్యమందొక మాండలికుడుగా నున్న సైపఖాను వద్ద మంత్రి యగు విరలేంద్రునకు సోదరుడు.

కవీంద్రుని కృతి బుధసభలందు ప్రశస్తి వహించుటకు శబ్దార్థరూఢి, రస స్థితి, బహువిధవ్యంగ్య భేదములు, భావములు, గతులు, శయ్యలు, అలంకారములు, రీతులు, పాకములు, దశప్రాణములు వృత్తులు, వస్తువివేకము గుణములు, కవి సమయములు, చమత్కారములు, వర్ణనములు నున్నగు లక్షణము లవసరము లని భైరవకవి కృతిప్రారంభమునం దొక సీసమునందు (1-14) పట్టికగా పేర్కొని నాడు. ఇవన్నియు జాతని కావ్యమున పుష్పమునందంతర్లీనమైన యామోదము వలె నొప్పి శ్రవణసుభగము లగుచున్న వని వాని నీకృతి పీఠికయందు పరిష్కర్త శ్రీరంగాచార్యగారు(సాహిత్యఅకాడమీ ప్రముఖ ముద్రణ 1979) సోదాహరణముగా నిరూపించినారు. కొంగ్రొత్త విషయములను వివరించుచు వారు దానికి గూర్చిన పీఠిక సాహిత్యప్రియులందరి కవశ్యపఠనీయముగా నున్నది

శతముఖముల పోషించు సాహిత్య కళా ప్రతిభాసంపద పెంపున చతురుడనని యాత్మ పరిచయము గావించుచున్న భైరవకవి

చెప్పెద కావ్యము రసములు
చిప్పిల వర్ణనల నింపు చిలుకగ బాకం
బుప్పతిల జిత్ర రచనలు
చొప్పడ శబ్దార్థఘటన సుకవులు
మెచ్చన్ (1-27)

అని తన రచనా నైదగ్ధ్యమును గురించి ప్రకటించుకున్నాడు. ప్రస్తుత మతని రచనయందు వానిని కొన్నిటిని సంక్షిప్తముగా తెలుపుటయే యీవ్యాసోద్దేశము.

కావ్యమునకు జిగిబిగి నాపాదించునవి వర్ణనలే. వాటివలన కవియొక్క భావనా బలము తేటతెల్లమగుచుండును. ఈ వన్నెలను పరికించండి.

తళుకు సుపాణి ముత్యాల మించులమించి మెలయుచుక్కల మేని మెరుగు దరిమి కలికిరాయంచరెక్కలరేక గిలుబాడి విరిమల్లె గుత్తుల మురువు దెడి చదువుతొయ్యలిమేని చాయ నుల్లసమాడి వెలిదమ్మి మొగడల తెలివి గెలిచి జిగిమీరుతొగరెక్క సిరులకు నసమిచ్చి పాపరాయని వన్నె కేపుమాపు

పాలమున్నీటి తరగల పసలనంది
కొండచూలుని మైతెల్పు కొంచెపరచి
కప్పతిలు చుట్టు గొండపై గొనలుసాగి
వెలది వెన్నెల లెల్లెడ వెల్లివిరిసె (2-48)

దెసలందు వ్యాపించిన వెన్నెల కాంతులు మౌక్తికముల మించులకు మించుచున్నట్లున్నవట! తారకల మేని మెరుగులను దరిమికొట్టుచున్నట్లున్నవట! మరాళపక్షముల నపహరించుచున్నట్లున్నవట! మల్లికాగుచ్ఛముల మురుపును దెగడుచున్నట్లున్నవట! భారతీదేవి శరీరచ్ఛాయ నెక్కసక్కె మాడుచున్నట్లున్నవట - వెలిదమ్మి మొగడల దెలివిని గెలుచుచున్నవట! తొగరేకుల నుపద్రవము కలిగించుచున్నట్లున్నదట! దండకూళ పుంగవుని వన్నెకే యాధిక్యము జూపుచున్నట్లున్నదట! గిరీశుని విగ్రహపాండురముల కించపరచుచున్నట్లున్నవట! ఉపమాసామగ్రితో నున్నతమైన ఈపద్యమతి మనోహరముగా నున్నది.

జలకేళి సలుపుచున్న రమాదేవి ముంగురుల కొనలందు చెంగలించుచున్న జలబిందువులు భ్రమరీబృంద మతి పానవశమున మకరందరసము గ్రక్కుడు మాడ్కినున్నవట (4-66) తడిసిన యంబరములలో వింతసొగసు లొలుకుచున్న తనను కన్మొయత్నముతోఁ జూచుచున్న విష్ణువుపై, లక్ష్మీదేవి జల్లిన నీటిధార యతని ముఖపద్మమున నాళమునగ వెలసినదట 4-65) సుకీర్తి గట్టించిన పట్టణమందలి సరోవరమధ్యముల మెరయుచున్న సరసీరుహములు, ఆపురివరవనితా వదనవైభవమునుగోరి దపస్సు జేయుచున్నట్లున్నవట! (4-264)

ఇంపు గొలుపు నిటువంటి మృదుల వర్ణనలు భైరవుని కావ్యమంతటను పూచిన కంగేడువలె భూరిగా గన్పించుచుండును.

పుష్పబాణుని రుచిరాకృతిని పురాణపురుషుడగు జాంబవంతుడు దప్ప మరెవ్వరు చూడలేదట! మన కవులెవ్వరు నాతడెట్లుండునో చూచిన పాపమున బోలేదు. చివరకు కుమారసంభవ కర్త కాళిదాసుగూడా చూచినట్లు లేదుగాని యీకవి సాంగుడైన మదనదేవుని మూర్తి విభవమును దర్శించి నేత్రపర్వముగా మన కన్నుల ముందుంచినాడు గమనించండి.

కప్పారు నెఱిచంద్రుకల కొప్పుకొప్పుగా
పారిజాతంపుఁ బూబంతి మెఱయ
రతిపదాలక్తకాంకితమైన నొసలిపై
నిలువుఁగస్తురి బొట్టు చెలువుమిగుల
కేయూరముద్రలు గ్రాల్కన్న గళమున
మౌక్తికంబుల కంఠమాల యమరఁ
జెదరుగందపుబూత జెన్నొందునురము
బద్మరాగంబుల పతక మొలయ
సరస సంభోగ శృంగార సహజమహిమ
లలిత యౌవన లావణ్య లక్ష్మిఁ బెనుప
ననుపమాన జగన్మోహనైకమూర్తి
దర్పకుడువచ్చె నింద్రు నాస్థానమునకు (2-52)

విశేషార్థములను స్ఫురింప జేయునట్లు పద్యములందు పదముల నౌచిత్యవంతముగా ప్రయోగించుటలో కవియొక్క విజ్ఞత పొడగట్టుచుండును. ఇక్ష్వాకుని తపోభంగము జేయజాలక బృందారక సుందరీబృందము పడినపాట్లను తిలకించండి.

ఉ - మేనకవిన్ననై నిలిచె,
మెల్లన మోమరవాంచె రంభ, లో
నూనిన వింత నివ్వెఱగు
నొందె దిలోత్తమ, గర్వహీనయై
దీనతనొందె నూర్వశి, మ
దింజలియించె ఘృతాచి యన్యకాం
తానిచయంబులెల్ల దవు
దవ్వులనుండె భయంబు పెంపునన్ (2-77)

రంభ మెల్లన మోమునరవాంచినదట. రంభ కదళీవృక్షవాచకము అరటి గెల చెట్టు గొమ్మల మధ్యను దలవొత్తినట్లు వలెఁ గాక దల వ్రందిక వాల్చిన ట్లొప్పియుండుట సహజమేకదా! అపురూపలావణ్యవతి తిలోత్తమలో నూనినవింత నివ్వెఱగు నొందెనట! చక్కనిదాననంచు నెల జవ్వనిననంచు జగంబులోన వేరెక్కనదాననంచు నిక్కుచు విఱ్ఱవీగుచు బరులఁ గణింపని కాంతలు తమ యందచందములు వారి నాకర్షించి గిలిగింతలు వెట్టనప్పుడు నివ్వెఱగు అనగా భ్రాంతి, యాశ్చర్యము, నిశ్చేష్టత నొందుట సహజమే గదా! (లోనూనిన వింత నివ్వెఱగు నొందెననుటలో కవి తైలవాచక శబ్దమయిన నూనెను ప్రయోగించినట్లుగూడా కన్పించుచున్నది)

ఊర్వశి గర్వహీనతయై దీనత నొందినదట! ఊర్వశి శబ్దమున కర్థము మిక్కిలి ప్రకాశించునది (ఉరుఅధికం వష్టిప్రకాశత ఇతి ఊర్వశీ - గురుబాలప్రబోధిక) తేజస్వినుల మని మిట్టి మీసై పడువారు పరులముందు పరాభవముపాలై జాల్కనయినపుడు గర్వహీనులై దీనత నొందుట సత్యమేకదా! ఘృతాచి మదింజలించినదట ఘృతాచి జలవాచకము. చలించుటమే నీటియొక్క లక్షణముగదా ఈవిధముగా నచ్చరల భంగపాట్లను చమత్కారపూర్వకముగా దెలుపుటలో భైరవకవి ప్రజ్ఞ వ్యక్తమగుచున్నది.

సన్నివేశములను రసస్ఫూర్తి గలుగునట్లు రూపొందించటంలో కవిమనీషిత బయల్పడుచుండును దీనిని పరికించండి.

చటులదిక్కరి కర్ణపుటపాటవప్రౌఢి
నొదవు నిర్భరఘోష మదరు మునుఁగ,
పాథోధమండల పాణి ధమములైన
కల్లోలవితతులు త్రుళ్ళడంగ
మకరవక్ర గ్రాహమత్స్య కచ్ఛపకోటు
లారలు నొండొంటి మఱువు కొదుగ
జక్రకటిట్టిభ సారస క్రౌంచముఖ జల
విహగజాలము గమి విచ్చి పఱవ
నారసాతల నిమ్నంబులైన మడువు

పట్లుపంకావిలంబులై బయలుపడగ
శిలలు గుల్లలు నిసుము చిప్పలునుదక్క
(1-152)

ఈ కావేరి తోయమే గ్రహింతునని బాడబ సమానకోపుడగు సుబోధుడు దత్సలిలంబు సకలమును నాపోశనముకై యరచేతి లోనికి దీసుకొనగా జలధులు పిండలివండుగా గలిగిన వట. భూచక్రంబు గ్రుంగిన దట! దిశావలయంబల్లల నాడిన దట! గోత్రశిఖరివ్రాతంబు గంపించినదట ఉల్కలు రాలినవట! గగనంబు బిట్టదరిన దట! అర్కుస్ఫూర్తి మాసినదట వజ్రి మదిం బెగ్గడిల్లినాడట. విరంచి చింతన వక్త్రపంకేజమును వంచినాడట
(1-154)

సుబోధుని కోపతీవ్రతను అప్పటి పరిస్థితులను ఈఘట్టమువలన నత్యంత సహజముగా ప్రబింబింపజేసినాడు

ఆశ్చర్యార్థకములను, ధ్వన్యనుకరణములను సూత్రమున గుదిగ్రుచ్చిన మణులవలె గ్రుచ్చి పద్యములను రమణీయముగా నిర్మించుటలో కవియొక్క నేర్పు ద్యోతకమవుచుండును. ఆశ్చర్యార్థకముల నన్నింటిని పొదిగి శ్రీరంగ నాయకుని- ఆపాదమస్తక (4-224) శోభనమును వర్ణించిన విధానమును పరిశీలించిన మనము దాని విన్నాణమున కక్కజపడి బాపురే యని యనకపోము! చోళమండలమున ననావృష్టి పీడనము వలన ప్రబలిన వేసవి కటకటలను ధ్వన్యనుకరణముల ద్వారా వర్ణించుచు చివచివ కదలించిన పద్యమును చూడండి.

కడుచేర్చి మిటమిటగాయు కట్టెండచే
భువనముల్ పొగపొగ బొక్కిపడియె
వేడియై బిసబిస విసరు గాడ్పుల ప్రాణి
తతులెల్ల దటపట దాకదొణగ
నొండెడ భగభగ మండు కార్చిచ్చుల
బెనుగిరుల్ పెటపెట ప్రేల జొచ్చె
బంకమై జవ జవ నింకు కాదంబుల
మలమలమ కరాళి మాడిపోయె
నెండచోఅంకెండ గడు నేచి యిరులు
గొనుచు
వఱలు కాంతార పంక్తులు వఱ్ఱుపోయె
నట్టనడు వేసవులను గాల్పు డలుగాక
జరగు నేలలు నిర్జన స్థలములయ్యె
(3-176)

మిటమిటగాయు కట్టెండచే జగములన్నియు పొక్కుడు లయినవట! బిసబిస విసరు వేడిగాడ్పులకు ప్రాణికోటి తటతట కొట్టుకొనసాగినదట భగభగమండు దావమువలన కొండలన్నియు పెటపెట ప్రేలజొచ్చిన వట! పంకమై జవ జవ నింకు కాదముల మకరాళి మల మలమాడ సాగినదట. కాంతార పంక్తులన్నియు చెంగార వఱ్ఱు (శుష్కించి) పోయినవట పొటిపొటి ధ్వన్యనుకరణములచేత వేసవి తొటతొటలను మటమటలను గనగనలను గిఱగిఱలను మనకుజూపించినాడు ధ్వన్యనుకరణముల ద్వారా పద్యమును చికిలీ చేయుపద్ధతి శ్రీనాథునిది. శబరకాంతల గొనబును గూర్చి యతడు చెప్పినచాటువు "గిటగిట నగు నెన్నడుములు పుట పుట నగు గన్నుగవ లనిʼʼ ప్రసిద్ధము. భైరవుడు శ్రీనాథుని పద్ధతినే యనుసరించి పద్యమును పాసపాసు బరువెత్తించినాడు)

భావస్ఫోరకము లగు దేశీయపదములను గూర్చి కలమును కదనుతొక్కించుట యందు కవిచాతుర్య మగుపించుచుండును లలిత లలిత శబ్దములను గలబోసిన యీగమనిక కనండి

పసిమిబాసి, ముదిరి, పసరింకి, పసుసనై,
పఱపు మిగిలి, తడలు పగిలి, తలకి,
పండి, తొడిమలెడల నెండుచు గారాకు
డుల్లె దరుల రవము పెల్లుగాగ. (2-40)

శిశిరమద కుంభిసంరంభ సింహామూర్తి, లీలనేతెంచిన మధుమాస కాలమందు కాంతినిబాసి, ముదిరి, పచ్ఛదనముతొలగి, పలుగనై తరులనుండి కారాకులు ధ్వని చేయుచు రాలిన వని ఒక యెండిన యాకు యొక్క 'దశావతారములను' చక్కగా తెలియజేసినాడు. అల్పాక్షరముల అనల్పార్థరచన గావించుటయగాదె కవి వివేకంబ యని పాలకుర్కి సోమన వచించిన దానికి యీపద్య మొకనిదర్శనము.

క్రియాపదముల ద్వారా సులభముగా సూటిగా భావమును విశదీకరించుట యందు కవియొక్క నిష్ణాతత్వము దోబూచులాడు చుండును. ఒక కవియొక్క రచనా సామర్థ్యమునకు పరీక్షాస్థానము క్రియాపదప్రయోగమే యని అరిస్టాటిలు నిర్వచనము పుంఖాను పుంఖములుగ విడిచిన ష్మారుని శరపరంపర ఇక్ష్వాకుని తపస్సుకు విఘ్న మొనరింపజాలక నిచ్చిపోయిన సందర్భమును విలోకించండి.

ఆడగె మలయానిలుండు,
సొంపఱె వసంతు
డలులు విభ్రాంతి నొందె,
గోయిలలు బెదరె
బెదరి మోములు వాంచె రాచిలుకపిండు
చిన్నవోయిరి దివిజరాజీవముఖులు (2-85)

మలయపవను డడంగినాడట. వసంతుడు సొంపరినాడట! తుమ్మెదలు విభ్రాంతి నొందినవట! కోయిలలు బెదరినవట రామచిలుకల దండు బెదరి మోములు వాంచిన దట అచ్చరలు చిన్నబోయినారట చిట్టి చిట్టి క్రియాపదముల నుపయోగించుచు మలయానిల వసంతుల-మరియు నచ్చరల- సంభ్రమాశ్చర్యహైన్యములను తుమ్మెదలకోయిలల చిలుకల భయాందోళన దైన్యములను నిపుణముగా ప్రదర్శించినాడు. కవిబ్రహ్మ తిక్కనగారియందీపద్ధతి గనుపట్టును. ద్రౌపది కీచకుని యింటికి మద్యమునుదే బోవు సందర్భమున నామెకు గలిగిన భయసందేహములలోని భావాంతరములను దర్శించడి.

తలకు పుట్టె గొంకు, కాలదికిమీరె వె
న్పాటుదోచె, ముట్టుపాటు దొడరె
వెఱగుపాటు దనికె, నెఱనాడె నొవ్వనె
వ్వగలునీనె, దిగులు వొదివె ..
(విరాట 2-106)

తిక్కనగారు త్రొక్కిన యీ త్రోవనే భైరవుడును సరించినాడనవచ్చును. ఇది యెగిరెడిపక్షిని గొట్టువిలుకాని నేర్పువంటిది

వర్ణనలవలెనే కావ్య సౌభాగ్యమును రెట్టింపు జేయునవి యలంకారములు. అవి పెక్కుభంగులు. అందొకటి ముద్రాలంకారము వృత్తములేదా పద్యముయొక్క పేరును ఆయా వృత్తములలో నిమిడించు సంప్రదాయమే ముద్రాలంకారము. భైరవుని రచనలో నివి యచటచట తళుక్కుమనుచుండును. నన్నెచోడునివలె కందములందు ముద్రాలంకారములను జిగేల్ మనిపించినాడు.

సిందూరపిండములో మరుకందములో (కుమార 3-46) మాకందము కడునిది రమ్యాకందము (శ్రీరంగ 4-78) భైరవుని మరికొన్ని ముద్రాలంకారములకు చూడుడు శ్రీరంగాచార్యగారి పీఠిక పుటలు.

(XII – CXV)

సందర్భోచితముగా పద్యముల నుపయోగించుటలోను కవి జాణతనము గోచరించుచుండును. భైరవునిలో గనుపించు నటువంటి కొన్ని పట్టులను పరికించండి.

నిర్మలచరితులు చతుర్ముఖ సమప్రతిభులగు సుబోధ సత్త్వులను మునులు చూచిన కావేరీతరంగిణిని 'సతతానేకమునీంద్ర బృందకృత పూజావందనం (1-40) బని యొక మత్తేభమున రచించినాడు. కావేరీ ప్రవాహగతి మత్తేభయానవలె నొప్పుచు వారికి మోదము గలుగ జేసిన దని దెలుపుటకు మత్తేభము నుపయోగించినాడు.

భూమిసురేంద్రు డొకడు బ్రహ్మవిద్య సంతోషముగ జెప్పి వెళ్ళినాడు. అతడెవరని సనత్కుమారుడు బ్రహ్మను ప్రశ్నించిన సందర్భమున నుత్సాహవృత్తము గలదు. సంతోషమును పదము ద్వారా ఇందువృత్తము పేరును సూచించినాడు (3-43)

జయధరుడు శశివంశ శ్రేష్ఠుని జూచి అనఘ! సోమవంశ తిలకుడైన తీర్థధరుని నందనుడ జయధరుండనగ దనరువాడనని (4-168) తనను పరిచయము గావించుకొను సందర్భమున నుత్సాహ వృత్తము గలదు. లోకములో నెవరినైనా నూతన వ్యక్తులను గలుసుకొని వారితో మనపరిచయము దెలుపుకొను సందర్భమున రవంత యుత్సాహమును బ్రకటించుచుండుట సహజమేకదా! ఈవిధముగా భైరవకవి యుత్సాహవృత్తములను రచించుటయందు చక్కని యౌచిత్యమును బ్రదర్శించినాడు (అవి యీకావ్యమున రెండు మాత్రమే కలవు)

ఆదిగురువులగు లక్ష్మీ విష్ణువుల జలవిహార సందర్భమున ఈరుతరపద్మనాళముల (4-97) నని చంపకమును రచించినాడు. నీటిలో వారు జలక్రీడలాడుచు నొకరిపై నొకరు నీళ్ళు చిమ్ముకొనుట పువ్వులు చిమ్ముకున్నట్లున్న దని దెలుపుటకు జంపకము నుపయోగించినాడు.

తెలుగుకవులు స్తుతిసందర్భమున దండకము నుపయోగించుచుందురు. కాని నన్నెచోడునివలెనే యితడును స్తుతి సందర్భమున లయగ్రాహిని రచించెను. ప్రభాకరుడనుముని సూర్యుని స్తుతించు సందర్భమున జయజయ సకలదివిజవయ మకుట (5-203) యని లయగ్రాహిని రచించినాడు. సప్తాశ్వరథసమారూఢుడై విశాలవియత్పథమున సతతమొకేరీతిగా జలించక లయనెరింగి గ్రహించి చరించుచుండువాడగుటవలన దివాకరుని లయగ్రాహియందభినుతించినట్లు రచించుట సమంజసముగా నున్నది.

చిత్రసేనుని పతనకారుల వధించుటకు విరూపాక్షుడు నిజకింకర గణంబును రణంబున కాజ్ఞాపించిన సందర్భమున 'బాహాకంపిత హేతిదీప్తులు (3-217) కుమారస్వామి సంగ్రామక్రియాలోలతను వెడలిన సందర్భమున చంచద్వాహన కేకిపింఛరుములు (3-218) రణారంభోజ్జృంభితమైన వైష్ణవభటవ్రాతంబుపైన జంభారాతి వజ్రమును వైచిన సందర్భమున (3-238) శార్దూలములను రచించెను. 'శౌర్యస్తవే నృపాదీనాంశార్దూలక్రీడితం మతమ్' అని క్షేమేంద్రుడు వచించిన దానికివి యుదాహరణములు. సింగంబాకటితో (విరాట 4-95) అను తిక్కనగారి శార్దూలములోను, కవిరాజశిఖామణి కుమారసంభవ శార్దూలములలోను శౌర్యస్తవమే కన్పించుచుండునని విమర్శకులు పేర్కొనుచుందురు.

భైరవుని శ్రీరంగమహాత్మ్యమునందు కందము లధికములు (463 వాటిసంఖ్య) శ్రీరంగ ...పీఠిక పుట (III) కందమనగా నాహ్లాదమును కలిగించునది భావము (కదిధాతువునుండి పుట్టిన కంద శబ్దము) ఈధాతు వాహ్లాదార్థకము (గురుబాల ప్రబోధిక) శ్రీరంగమనగా సౌందర్యము రాశిగా గలచోటని సౌందర్యమునకు నిలయమైన ప్రాంతమని వ్యుత్పత్తి. చెలువునకు నెలవైన ప్రదేశమాహ్లాదమును గలిగించునదే కదా! అందువలననే యాహ్లాదకరమగు స్థలమాహాత్మ్యమును వర్ణించుటకు కవి యాహ్లాదార్థములగు కందములు విరివిగా నుపయోగించియుండవచ్చునని యూహింప వీలగుచున్నది. తన పేరు భైరవుడైననూ భైరవము తన కవిత్వమందు గౌణమని తన కవిత్వమాద్యంతము కందమే యని ఆహ్లాదకరమే యని చాటి చెప్పుటకు గూడా భైరవుడు కందములు బహుళముగా రచించెనేమో! ఒక్కమాటలో జెప్పవలెనన్న భైరవుని కందములు ఎడదలోతు లిచ్చి యెదుటివారి నాకర్షించు మధుమూర్తుల వంటివి.

1) చక్కటివచనమువలెసాగిన కందము
దివిసాగము వికసిత...
నవసారసదళ విశాలనయనంబుల
(1-173)

2) నన్నెచోడ పోతన మహాకవులవలె
పిదపిదసాగి మిల మిలలాడిన కందము
తగుదగదని మనమున మును
(కుమార - 10-136)
అడిగెదనని కడువడి జను
(భాగవత (8-103)
పొడగని యడరెడు భయమున
(శ్రీరంగ 3-64)

3) సూక్తులను జొప్పించిన మధురకంద ములు
1) నాలుగుపురుషార్థములకు (5 60)
2) వరపుత్రవంతులకు (2-60)

4) పెందరగల మృదంగ నాదమువలె సాగిన శ్రవణ సుకర కందములు
1) శరదముల కమలలోచను (4 62)
దవనము ..వనలక్ష్మివినో (44-80)

(భైరవుని ద్విప్రాస, త్రిప్రాస, అంత్య ప్రాస, అను ప్రాస కందములకు చూడుడు శ్రీరంగమహాత్మ్య పీఠిక పుటలు Cxv - Cxiv పరిష్కర్త శ్రీరంగాచార్య)

ఈవిధముగా భైరవుని కందములు సూకలాశ్వమువలెగాక కళ్ళెముబట్టి నడిపించిన కర్తలాణమువలె టకటక సాగి వేడుక గలిగించుచుండును

అతుయమేధానిధి కావ్యలక్షణ కళాచార్య (1-2) డని శేషుని స్తుతించుచు భైరవుడుపలికిన వాక్యము అతనికిఁగూడా అన్వయింపవచ్చును

ఈ వ్యాసమున నుపకరించిన గ్రంథములు
భైరవకవి శ్రీరంగమహాత్మ్యము - పరిష్కర్త శ్రీరంగాచార్య సాహిత్య అకాడమీ ముద్రణ 1979
నన్నెచోడుని కవిత్వము -
అమరేశం రాజేశ్వరశర్మ.
ఆంధ్ర సాహిత్య చరిత్ర -
శ్రీ పింగళి లక్ష్మీకాంతము

# 8. దీపావళి

– శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ, ఎం. ఏ.

ఆనందోత్సవ కారణంబు, విజయ వ్యాహార రూపంబు, వి
జ్ఞాన శ్రీనిలయంబు, గాఢతిమిర చ్ఛాయా సముచ్ఛేదమున్,
నానా మానవశీలరూపిత మహానైపుణ్య గణ్యంబు, నెం
తేనిన్ విందును గూర్పవచ్చును గదే! దీపావళి పర్వమున్ ॥

ప్రకృతిలక్ష్మికి శరత్ప్రభుఁ డొసంగిన లసద్రమణీయ రత్నహారం బనంగ
అందాలకరులందుఁ బొందుగా గృహలక్ష్మి కీలించు మందారమాల యనగ
పతిరాకకై నిశాసతి వేడ్కతోడ నేర్పఱచు స్వాగతపు టారతు లనంగ
పర్వలతాంగి శోభాసముల్లసితయై యొనగూర్చు విజయతోరణ మనంగ
బారులనుదీర్చి కాంతుల నారఁబోసి, రంగుమీఱంగఁ బ్రతిగృహ ప్రాంగణమున
వెలిగె దీపాళి కనులకు విందుగాగ, దివ్యదీపావళీ పర్వదినమునందు ॥

మనుజ సామాన్యజీవనపు సంక్రాంతిలో వర్ధిల్లు ప్రగతిరూపము లనంగ
కడగండ్లచీకట్ల నడయాడు నిరుపేద కనులందు వెలుగొందు కాంతు లనఁగ
పయనించు మనుజుని బ్రతుకు టెడారిలో శ్రీలుచిందెడు 'ఒయాసిస్సు' లనఁగ
బడబావృతమ్మౌ ప్రపంచపయోధి నొక్కటఁ దోచు నమృతశీకరము లనఁగ
బారులనుదీర్చి కాంతుల నారఁబోసి రంగుమీఱంగఁ బ్రతిగృహ ప్రాంగణమున
వెలిఁగె దీపాళి కనులకు విందుగాగ దివ్యదీపావళీ పర్వదినమునందు ॥

తాను కాలినను లోకాన వెల్గుగును సదా నింపుమంచు 'మతాబు' తెలుప
తన జీవితపు వెలుంగున హెచ్చుతగ్గులు వలదంచు 'పువ్వొత్తి' తెలియఁజేయ
తనవర్తనమున తొందరపాటు తగదన్న సరణి 'సీమటపాసు' చాటిచెప్ప
తనశక్తి యిటుసంఘమున మించవలెనంచు నెలమిఁ 'దారాజువ్వ' లెసక మెసగ
కష్టములయందె సుఖములు గలవటంచు దమమునందున దీపాళి తనరుచుండ
పుడమిజనులకు సందేశమూర్తి యగుచు వచ్చు దీపావళికి నిత్తు స్వాగతంబు

# 9. శివశంకరులు - కవిప్రియ

(గతసంచిక తరువాయి) - శ్రీమతి కె. వి. శ్రీరంగనాయకి, ఎం. ఏ

## ఐదవ రంగము

మదనభూపతి కాశ్మీరకవికి శూలారోపణశిక్ష విధించాడు. అదియు కన్నుల యెదుటనే బిల్హణకవి ముఖంలో ఏమాత్రం విచారంలేదు మందహాసంతోనే చూస్తున్నాడు. 'అద్యాపి తద్వికసితాంబుజ' ఇత్యాదిగా తన ప్రేయసీ ముఖాన్ని స్మరిస్తాడు

ఇంతలో రాజగురువు వచ్చి రాజు కవికి విధించిన శూలారోపణశిక్ష ధర్మం కాదని తగిన హేతువులతో చెపుతాడు తరువాత అమాత్యుడు వస్తాడు. కవి యామిని చేష్టితాలను భగవచ్చేష్టితముల వలె స్మరిస్తాడు 'అద్యాపి తాని హృదు' అని.

అమాత్యుడు బిల్హణకవికి శూలారోపణశిక్ష తగదని మనవిచేస్తాడు బ్రాహ్మణుడు శిక్షార్హుడు కాడని మంత్రి చెప్పగా 'ఓ బ్రాహ్మణామాత్య! మీరు జాత్యభిమానంచే చెపుతున్నారు కాని అంతఃపుర ద్రోహంచేసిన వారికి ఇంత కన్న తక్కువశిక్ష లేదు అనగా ఆ అమాత్యుడు తమసేవలో చేరినప్పుడే నా బ్రాహ్మణత్వం కొంతపోయింది నేను చెప్పకున్నను తరువాత మందారమాల మహారాజ్ఞి స్వయంగా వస్తుంది అనెను

మందారమాల వచ్చి కవికి శూలారోపణశిక్ష తొలగింపవలసిందని ప్రార్థించింది రాణికూడా బ్రాహ్మణాభిమానం చూపించినందులకు రాజు కష్టపడ్డాడు వ్యాఘ్రశాబం వంటి బ్రాహ్మణకవికి శిక్ష వేయకుండు టెట్లు? అనగా రాణి ఆ పులిపిల్లను ముందర దగ్గరకు తీసుకొన్న నేర మెవరిది? అదీకాక ఒక్క కన్నను ఒంటరిగా వదలినందువలన ఇంత ఉపద్రవం పుట్టింది అన్నది ఒకే ఒకపిల్ల అని అల్లారుముద్దుగా పెంచినందుకు నాకీ అపకీర్తివచ్చింది తలచుకొన్న నాశరీరం మండిపోతోంది నీవు కోరినట్లు ఈకవిని విడిచిపెట్టినప్పటికీ ఈఅపవాదు పోదు కదా! క్రియాకుమారుడు వచ్చి మరల నాబిడ్డను పెండ్లియాడడుకదా! అని రాజు కష్టపడుతుండగా, మందారమాల నిశ్చలంగా మదభూపతిని చూసి బిల్హణునికి శిక్ష తొలగించి అతనికి యామిని నిచ్చి పెండ్లిచేయుట ఉత్తమోత్తమంగా ఉంటుందని ఇచ్చట కులాభిమానాలు లేవనీ బిడ్డమీద తల్లిపడే వాత్సల్యమే అనీ బతిమాలుతుంది అప్పుడు రాజు భాగ్యహీనుడై విద్యచే ప్రతికేవానికి నే నెలా పిల్లనిస్తానని సందేహించాడు. ఈ సందేహంలో నేటికాలంలోని 'బతకలేక బడిపంతులనేమాట' ధ్వనితమౌతోందేమో?

వెంటనే మందారమాల మీఅనుగ్రహంలో బిల్హణకవి చంద్రుడు కూడా చిన్నప్రభ వౌతాడని తన కోరిక చెప్పింది ఇంతలో బిల్హణకవి 'అయికిమనికం బాలే' అని మరల యామినిని స్మరిస్తాడు.

మందారమాల బిల్హణుని సౌందర్యాదులు చెప్పి అస్మత్కుమారీపాదయుగళం బద్ధమైకదలలేదనుచు చెప్పుచుండగా, యామినీదేవి విచారంతో వచ్చి తల్లిని కౌగలించుకొంటుంది రాజు మెను కన్నెత్తి చూడలేదు అప్పుడు తల్లి అమ్మా! ఎంత చెప్పినను రాజుగారి మనస్సు కరుగలేదు నీవు ప్రార్థించిన ఏమైన ప్రయోజనం ఉంటుందేమో అని ఉపాయం చెప్పింది.

యామినితండ్రి పాదాలపై బడి, కవికి అభయం వేడింది రాజు మౌనం వహించాడు

అల్పక్షణాలలో కాశ్మీరకవివర్యుని ప్రాణాలు పోతున్నాయి అపరాధండన మాన్పించవలసిందిగా ప్రార్థించింది రాజు ససేమిరా అన్నాడు. మళ్ళీ ప్రార్థించింది బతిమాలింది అంతలో కోటిపాలుడు కవికి శూలారోపణ చేయటానికై చివరిసారిగా నీ యిష్టదైవాన్ని ధ్యానించుకొమన్నాడు కవిమందహాసం చేస్తూంటే కోటిపాలుడు కింకారణం కవివరేణ్య! దరస్మితోఽసి? భీతిర్న కిం తవ? అని అడుగుతాడు. అప్పుడు వెంటనే కవి

"భగ్నస్యతి భీః కథం వా?
ఉత్ఫుల్లలోచన లసద్వదనారవిందా
దేవీమదీయహృదయే నివసత్యజస్రమ్"

అని సమాధానం చెప్పాడు.

అమాటలను యామిని విన్నది. మరింత ఉద్వేగంతో ధైర్యంతో తండ్రిని ప్రార్థించింది రాజు యామినిని చూచి ముఖం త్రిప్పుకొన్నాడు బిల్హణకవి యామినీదేవిని తన ప్రియురాలిని, హృదయేశ్వరిని మరొక్కసారి స్మరించాడు మదనభూపతి తన అనుగుకూతును బుజ్జగించుచూ బిల్హణుడు కవికాబట్టి నిన్నుమాటలతో మోసంచేస్తున్నాడనిఅంటాడు అప్పుడు యామిని కవిప్రవరుఁడట్టివాడు కాడు విమలరత్నమని స్పష్టపరుస్తుంది అపుడు మదనభూపతికి మనస్సు మారింది పుత్రికపై జాలి కలిగింది కానీ నీపై కవి కింత ప్రేమకలదా! అని ప్రశ్నింపగా, యామిని నాకై ప్రాణాలుకూడా సంతోషంగా ఇస్తున్నాడు అని చెపుతుంది యామిని ఇలా చెపుతుండగా కవి తన ఇష్టాన్ని బ్రహ్మను సంబోధించి పలుకుతాడు.

పంచత్వం తను రేతు భూతనివహా
స్స్వాంశాన్విశంతు ధ్రువమ్
హేధాతః! ప్రణిపత్య సాదర మిదం
యాచే నిబద్ధాంజలిః

తద్వ్యాపీషు పయః, తదీయ ముకురే
జ్యోతిః, తదీయాంగణే
వ్యోమస్యాచ్చ తదీయవర్త్మని ధరా
తత్తాలవృంతేఽనిలః'

అని ప్రార్థించి శూలాన్ని సమీపించాడు. రాజునకు కవిపై నమ్మకం కుదిరింది మరణశిక్షను వారించి

'బాలార్కద్యుతిమత్కిరీటము శిరోభాగమ్ముమీదన్ మణి
ప్రాలంబంబురమందు కాంతులెసగన్ భద్రేభయూధమ్ముపై
నీలచ్ఛత్రము క్రింద బిల్హణుని నిర్ణిద్రోత్సవశ్రీలతో
ఆలోకింపగ పౌరులెల్లకొనిరమ్మా! కోటపాలాగ్రణీ'

అని ఆజ్ఞాపించాడు యామిని తండ్రికి నమస్కరించింది రాజు యామినిశిరాన్ని మూర్కొన్నాడు ఇవి కవిప్రియా విశేషాలు.

ఈకవిప్రియా నాటకం 5 రంగాలతో కూడిఉంది శృంగారం రసతరంగితమై కాశ్మీరకవి నాయక అలంకృతమైంది ఈమధురకథా నాటకాన్ని 5 అంకాలుగా చిత్రించటంలో ఒకవిశేషం ఉంది ఈనాటికలోని రంగాలకు అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అని శ్రీ శివశంకరులు నామకరణం చేసి యుండారని పెద్దల అభిప్రాయం కాబోలు శ్రీ శివశంకరుల కథావిభాగం నుండి రంగ నిర్వహణం నుండి ఈస్ఫూర్తి కలుగుతోంది ఇది సంస్కృతాంధ్ర సాహితీ తత్పరులకు పంచబాణరసాయనం వంటిది

బిల్హణచరితలో శీలాన్ని శంకించి రాజు వ్యాధుల్ని కల్పించి కాండపటాన్ని అభ్యంతరంగా చేశాడు కానీ ఆఅభ్యంతరం నిలువలేదు లోకజ్ఞులైన సాహితీ సమ్రాట్టులు అభ్యంతరం పెట్టలేదు అప్రయోజకమైన కల్పనలను ఉత్తమ కావ్యాలలో ప్రాజ్ఞు అంగీకరింపరు స్వాభావికమైన దానికి విరుద్ధం కూడా కాబట్టి ఆకాండపటం(తెర) కవిప్రియలో చేరలేదు

కవిప్రియలో మదనభూపతి యామినిని విద్యావిషయానికై సభను ఏర్పాటు చేయుఘట్టం లేదు ఆఘట్టం బిల్హణకవి చంద్రుని కీర్త్యుత్కర్షలకు అపకర్ష యగుటచే

ప్రవేశంలోనే యామిని కాశ్మీర కవియందనురక్తయై ఆతనిం గూర్చి పద్యాలల్లటతో కవిప్రియ ప్రారంభమౌతోంది కవితావ్యాసంగంతో నాటకాన్ని ప్రారంభించటం అంటే నాటకీయతను సమగ్రంగా పర్యాలోచన చేసి దానిరహస్యాలను తలస్పర్శిగా అవగాహన చేసుకొని ఆ మార్గానప్రభుత్వం సంపాదిస్తే గాని ఇట్టి విధానం అలవడదు

ఈకవిప్రియ యందలి బిల్హణకవిని జాగ్రత్తగా పరికించితిమేని శ్రీశివశంకరుల లక్షణాలు కాశ్మీరకవినుండి పోల్చుకొనవచ్చును ప్రవచనమువలెనే కొంత కోపం ఆగక పైకుబికివచ్చుట గురులతో వాసంచేసిన వారికి అనుభవ సిద్ధమయిన విషయం శ్రీ శివశంకరులు కోపమును మాట లేక శాంతముగా నెట్లుందురో మనం బిల్హణపాత్రనుండిపోల్చుకోవచ్చు నిత్య సంతోషం, సదా శ్రేయస్సహనం నూతనకవులను ఉత్సాహపరచటం వీరికి వలెనే బిల్హణకవికిని నిత్యలక్షణాలుగా చిత్రించారు

కవిప్రియలో కవి యామినిని వర్ణించగా యామిని యామినీవల్లభుని వర్ణించింది ఈకల్పన కథాసామరస్యానికి మేలి ఉదాహరణం

మహారాజ పుత్రిక రాజపుత్రికగా కాక కవిప్రియగా ప్రసిద్ధికెక్కవలెనని యే కోరుట కవుల రసజ్ఞతకును, యామిని సరసతకును, ఎంతయో అలంకారం అందు మూలములో కొరవడిన ఈయామిని కోరికను శ్రీ శివశంకరులు వన్నెలు చిన్నెలు తీర్చి దిద్దిన కవిప్రియా రమ్యగాథ కనకవర్ణ రంజితంబగు నని ఉవ్విళ్ళూరింది ఈ చిత్రణ అచ్ఛమైన కవి చేయవలసింది కాబట్టి కవిప్రియలో నిబద్ధమైంది.

కవి అనేక జన్మార్జితపుణ్యసంచయం గల పురుషునికి నిజమనోహారిణి మహానిబిడ బాహు మధురబంధంలో మరణ సుఖం వస్తుందన్నాడు ఇది బిల్హణచరిత్రలోని అంశమైనా అచ్చట కవికంఠోక్తిగా చెప్పలేదు ఇచ్చట ఉంది ఉండవలసింది కానఉంది ఆమాటకు అతని ఆచరణం అనుగుణమైంది

బిల్హణచరిత్రలో కవి యామినిని ప్రేమించినట్లు చెప్పలేదు కవిప్రియలో యామిని స్వయంగా తండ్రిని బతిమాలింది ఈకల్పన రసోచితం, స్వాభావికంగా ఉంది

కవిప్రియలో యామిని ఎంతో త్వరపడింది కవిమాత్రం ఎన్నోవిధాలైన వెనుక ముందులాలోచించాడు. ఎంతైనా తనగంభీరముద్రను వదల్లేదు బిల్హణ చరిత్రలో ఇరువురూ తమ స్థాయినుండి కొంత దిగజారారు

బిల్హణీయంలో యామిని వృత్తాంతం తెలిసికొని మదనాభిరామ భూపాలుడు న్యాయస్థానంలో విచారణ పెట్టాడు. అలా చేయడం రాజమర్యాదకీ అంతఃపుర మర్యాదలకీ కొంత భంగకరం. కవిని న్యాయస్థానానికి తీసుకొనిపోవటం, కవి చేసిన దోషాన్ని ఉద్ఘాటించడం అంతగా రాచరికానికి తగవు

కవిప్రియలో న్యాయస్థానం విచారణ లేదు. అంతఃపురంలోనే రహస్యంగా విచారణ జరిగింది ధర్మాన్ని రాజగురువు, మహామాత్యుడు, మందారమాల, యామిని

వచ్చి చెపుతారు ఇది సమంజసంగా ఉంది కవికి శూలారోపణశిక్ష ప్రాకారంలోపలే జరిగింది. ఇది సామాన్యంగా మహారాజ కుటుంబాలలో జరిగేఆచారం. అందువల్ల అంతఃపుర రహస్యాల్ని రహస్యంగానే కవిప్రియలో శ్రీశివశంకరులు చిత్రించారు ఇది సముచితం కాళిదాసు అగ్ని వర్ణుని అంత్యసంస్కారం కూడా ఉద్యానవనంలోనే మంత్రులచేత రహస్యంగా చేయించాడు

కాశ్మీరకవి కవిప్రియలో మనకు తొలి నుండి తుదివరకు ఒకేవిధమైన గంభీర ముద్రతో ప్రత్యక్షమౌతాడు. అతని హృదయం యామిని ప్రేమించినప్పుడెంత ఆనందంగా ఉందో శూలారోపణశిక్ష విధించినప్పుడు కూడా అట్లాగేఉంది. మందహాసం అతనికి సహజభూషణం. ఇటువంటి నాయకులు సాహిత్యానికి కొంతమంది మాత్రమే పరిచితులు.

మూలంలోని శ్లోకాలకు శ్రీ శివశంకరులు తెలుగుపద్యాలు వ్రాసారుకానీ ఆ పద్యాల నిందు మేళనం చేయలేదు బిల్హణీయంలోని శ్లోకాలనే ఉంచారు అలా శ్లోకాలనే ఉంచటంవలన నాటకానికి అందంవచ్చింది. సన్నివేశానికి సహజత వచ్చింది.

సహజంగా శ్రీ శివశంకరులకు సంస్కృతమంటే అభిమానం ఎక్కువ ఆ అభిమానంతో ప్రసిద్ధాలైన శ్లోకాలను అన్నిటే కవిప్రియలో నిక్షేపించారు తమ గ్రంథాల్లో ఇతరకవుల రచనల్ని సమాదరించు అజాతశత్రుత, ఔదార్యం, శ్రీ శివశంకరుల ప్రత్యేకత

వారి సూచనల్లో ఆదేశకాలాల్లోని రాజగృహనిర్మాణాలు, వారి సంప్రదాయాలు, ఎలాఉండేవో వివరించారు ఆ నిర్మాణాలు వారి సంజ్ఞా వ్యవహారాలు మనం కవిప్రియనుండి తెలిసికోవచ్చు.

వీరు మందారమాల పాత్రచిత్రణలో స్త్రీకిగల వాత్సల్యాన్ని, కూతుభంగపాటునకు తల్లిచెందు ఆవేదన, సమయస్ఫూర్తిగా రాజుగారితో మాట్లాడుట మున్నగు గుణాల్ని వీరు చక్కగా పరిపోషించారు

వీరి పద్యనాటికలయందలి నాయికా నాయకుల సంభాషణనుండి వకుళమాల, హృదయేశ్వరి, మున్నగు పదాలు వినిపిస్తుంటాయి ఈ పేర్లుగల వీరి గ్రంథాలు మనకు సుపరిచితాలు కాబట్టి ఆట్టి గ్రంథాలను మనం సుపరిచితంగా ఊహింపవచ్చు

కాశ్మీరకవిని శూలారోపణకై కోటిపాలుకు వెంటబెట్టుకొని పోయినపుడు యామిని అర్ధనారీశ్వర చిత్రాన్ని చూసి చిత్తపమహాకవి విరచితమైన 'అచ్ఛిన్నమేఖల' మను శ్లోకాన్ని స్తుతిచేయటం వీరి సమయస్ఫూర్తి ఇది ఎంతైనా మెచ్చుకోదగ్గ విషయం.

ఈచిత్తపమహాకవి ఆంధ్రుడనీ ప్రతీహారభోజుని ఆస్థానకవిగా ఉన్నవాడనీ ప్రతీతి ఉంది

అగ్రహారోదగ్రుడైన మదనభూపతిని శాంతింపచేయటానికి రాజగురువు, మహామాత్యుడు, మందారమాల (రాణి) చివరకు యామిని వరుసగా బతిమాలుట యామినియందలి అనురాగ విశేషాన్ని సూచించు కవి శ్లోకాల్ని మహారాజు వినటం, ఈకవిప్రియలో కమనీయంగా చిత్రించబడ్డాయి ఈసన్నివేశం స్వభావసిద్ధమై రసానికి పరిపుష్టిని కల్గిస్తోంది సంభాషణలు కూడా స్వాభావికాలు, మధురాలునై విలసిల్లుతున్నాయి.

కథా సంవిధానం రంగనిర్వహణ విభాగాలు కథామాధుర్యానికి రామణీయకాన్ని కూర్చాయి రెండుపక్షాలలో జరిగిన ఈకథ చక్కగా కవిప్రియగా చక్కగా తెనుగుదనాన్నలవరుచుకుంది సంస్కృతహృదయులగు శ్రీ శివశంకరుల తెలుగునాటిక ఆంధ్ర సామ్రాజ్యానికి శారదచంద్రికల్ని వెలయించింది

ప్రసిద్ధాలైన సంస్కృత శ్లోకాలను పొదగటంలో వారుచూపిన విశిష్టత అసాధారణమైంది ఈ కవిప్రియకోరికే సంస్కృతమున బిల్హణచరిత్రగా రూపొందిందా ? అనిపిస్తుంది.

సాహిత్యంలో నాటికలకు విలక్షణమైన గౌరవం ఉంది నాటకంలో సాహిత్యంతోపాటు సంగీతాభినయాలకు కూడ స్థానం ఉంది పద్య గద్యమయాలైన కావ్యాలలోకాని చంపువులలోకాని ఈ సంగీత సాహిత్యాభినయాల సమ్మేళన లేదు కావున మనపూర్వులు నాటకానికి ప్రత్యేకంగా గౌరవస్థానాన్ని ఇచ్చారు

అటువంటి నాటికా ప్రక్రియలోకూడ శ్రీ శివశంకరులు మరొక నూతన చైతన్యాన్ని వెలార్చారు.

పద్య గేయ నాటికారచనతో ఈఅభినవమార్గం మొదలైంది.

గద్యంకంటె పద్యం ఉత్సాహజనకం. ఈ పద్యానికి సంగీతాభినయాలు భావానుగుణంగా ప్రతిష్ఠితంకావడంవల్ల ఈ 'కవిప్రియ' రసజ్ఞులోకానికే ప్రియమైంది. శ్రీ శివశంకరుల హృదయం నిత్యనూతన మార్గాన్ని అన్వేషించేది కాబట్టి ఈ 'కవిప్రియ' తెలుగు సహృదయులోకాని కందింది వారి హృదయంవలె, వారిసంభాషణంవలె, వారి నడకడివలె, వారి రచనలు కూడ మృదువులు, మధురాలు, అమలినాలు.

ఈ కవిప్రియ సర్వకవిప్రియ. సహృదయ హృదయాది కవిప్రియ. శ్రీ శివశంకరుల సత్యశివ సుందరాత్మకమైన కవితామాధురులు హితాలై ప్రియాలైనాయి

# 10. 'అపరగౌతమ' గుమ్మలూరి సంగమేశ్వరశాస్త్రి-తర్కసరస్వతీ వరివస్య

- శ్రీ ఉపద్రష్ట వెంజ సర్వమంగళేశ్వరశాస్త్రి.

అది పదునెనిమిదవశతాబ్దము. 'కావ్యశాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతామ్' అనునట్లుద్దండ పండితులు తమ తమ పాండితీ శౌండీర్యములను ప్రదర్శించిన కాలమది బొబ్బిలి, విజయనగరము మొదలగు సంస్థానములలో పండితగంధ సింధురయూథముల శాస్త్రసంగ్రామములు ప్రభువుల సమక్షములో 'చాక్షుష క్రతువు' లుగా వీనుల విందులుగా జరిగిన రోజులవి అటువంటి మహోత్తమకాలములో నాటి శ్రీకాకుళ మండలమునకు సంబంధించిన బొబ్బిలి తాలూకాలోని గంగన్నపాడనెడి అగ్రహారమున వేంకమాంబా లక్ష్మణారాయణ పుణ్యదంపతుల నోములపంటగా పుట్టినవారే శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు. క్రీ శ. 1834వ సం॥ము వీరి జననకాలము.

అభినవాంధ్ర కవితాపితామహులుగా విఖ్యాతి కెక్కిన బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వర విద్వత్కవీశ్వరుల యొద్ద సంగమేశ్వరశాస్త్రిగారు సంస్కృత కావ్యములనభ్యసించిరి తరువాత బొబ్బిలి నగరరాజాస్థాన పండితులైన సుసర్ల సీతారామశాస్త్రి ప్రవరులయొద్ద తర్క ప్రకరణ పంచకము నధ్యయనముచేసిరి. తదనంతరము సంగమేశ్వర శాస్త్రిగారు కృష్ణామండలాంతర్గత గుమ్మలూరి వాస్తవ్యులైన శ్రీపాదరామశాస్త్రి వర్యుల యొద్ద నవ్యన్యాయములోని పంచవాద గ్రంథములను పఠించి తర్కశాస్త్రమున స్వయం నిష్ణాతు లయినపుటికి అసంతుష్టులై విజయనగర మహారాజసంస్థానపండిత వరేణ్యులైన మహీసూరు భీమాచార్య మహోదయుల సన్నిధిలో గదాధర భట్టాచార్య కృతానుమాన ఖండగ్రంథముల నధ్యయనము చేసిరి శ్రీపాదరామ శాస్త్రిగారి యొద్ద తర్కప్రకరణముల నభ్యసించు శ్రీసంగమేశ్వరశాస్త్రి గారికి సుప్రసిద్ధ మంత్రశాస్త్రద్రష్టలు, 'తర్కతీర్థ' బిరుదాభిశోభితులునైన ఆదిభట్ల రామమూర్తి శాస్త్రిగారు సహాధ్యాయు లగుట సంభవించి శ్రీసంగమేశ్వరశాస్త్రి గారు భీమాచార్య గురువరేణ్యుల యనుజ్ఞను పొంది కాశికి పాదచారులై పయనించి యట జగదీశపంచానన భట్టాచార్యుల వారియొద్ద మథురానాథకృత తార్కిక సంప్రదాయములను తెలిసికొనిరి జగదీశ పంచానన భట్టాచార్యుల వారంచికాలములోనే శాస్త్రిగారిశాస్త్ర పారంగతత్వమున కచ్చెరువంది యచ్చటి కాశీరాజ మహాసభలో పండిత పరిషత్తు జరపించి తత్రత్యులైన పండితులతో శాస్త్రార్థచర్చ జరిపించిరి. అచ్చట సకల పండితజనసమక్షములో చదలు మారు మ్రోసిన చూపరుల కరతాళధ్వనుల మధ్య కాశీరాజుగారు సంగమేశ్వర శాస్త్రిగారికి జయపత్రికలను సమర్పించి దుశ్శాలువను కప్పి ఘనముగా సత్కరించిరి.

అచ్చటినుండి శ్రీ శాస్త్రిగారు నవద్వీపమునకు వెళ్ళిరి ఈనవద్వీపము తర్కపండితులకు తరుగని గని ఇచ్చటి విద్వత్కుంజరములతో కూడ శ్రీశాస్త్రిగారు వాదోపవాద వాగ్యుద్ధమునకు సింహసన్న శ[illegible]గా తలపడిరి. వాదనయందు సంగమేశ్వర శాస్త్రిగారి కపారమైన నైపుణ్యము గలదు నవద్వీపమునందలి పండితులను నిరుత్తరులను చేసి యచ్చట కూడ ప్రశంసాపత్రికలు పొందిరి ఈవిధముగా శ్రీ సంగమేశ్వర శాస్త్రిగారు పాండిత్య దండయాత్రలలో దిగ్విజయ పరంపరలను పొందుచు గద్వాల సంస్థానమునకు విచ్చేసి యచ్చటకూడ తిరుగులేని విజయమును పొందిరి.

శ్రీ సంగమేశ్వర శాస్త్రిగారు మహీసూరు భీమాచార్యులవారికి పుత్రకల్ప శిష్యులు. గురువుగా రనపత్యులగుటచే సంగమేశ్వరశాస్త్రిగా రాచార్యుల ఇంటి యొద్దనే సంసారము సాగించిరి అప్పటికే సంగమేశ్వర శాస్త్రిగారి నామము సువిశ్రుత మగుటచే పెక్కుమంది శిష్యులాయన చుట్టును చేరిరి. నాడు తర్కశాస్త్ర మభ్యసించినవారిలో నూటికి ఎనుబది మంది శ్రీశాస్త్రిగారికి శిష్యులే యనుట యత్యుక్తి కాజాలదు.

తరువాత శ్రీ శాస్త్రిగారు శిష్యుల ప్రోద్బలముపై పశ్చిమ గోదావరీ మండలమునకు చెందిన కాకరపర్రు గ్రామమున కేగిరి గ్రామము యావత్తు ఆ పుంభావ సరస్వతిని సాదరముగా ఆహ్వానించి గౌరవించినది ఆ గ్రామస్థులందరు వీరి శిష్యబృందమునకు భోజనాది సకలసదుపాయములను కల్పించి తమ భక్తిప్రపత్తులను ప్రకటించుకొనిరి కాకరపర్రులో శ్రీ సంగమేశ్వర శాస్త్రిగారు శిష్యులకు శాస్త్ర మధ్యాపనము చేయుచు మూడున్నర సంవత్సరము లుండిరి.

ఇంతలో వీరి గురువుగా రయిన భీమాచార్యులవారికి చరమావస్థ సమీపించినదని తెలియఁగా విజయనగరము వెళ్ళి అచ్చట స్థిరపడిపోయిరి. గురుభక్తి పరాయణులగు శ్రీశాస్త్రిగారు గురువుగారి అంత్యక్రియలను జరిపి గురు ఋణమును తీర్చుకొనిరి తరువాత విజయనగర ప్రభువులైన ఆనందగజపతిగారు శ్రీసంగమేశ్వర శాస్త్రిగారిని సంస్కృత కళాశాలలో ప్రధానాధ్యాపకులుగ నియమించిరి. క్రీ॥ శ 1893 వ సం॥లో శాస్త్రిగారు సంస్కృత కళాశాలలో ప్రధానాధ్యాపక పదవి నలంకరించిరి. మహీసూరు భీమా

చార్యులవారి మరణానంతరము సంగమేశ్వరశాస్త్రిగారు ఆనంద గజపతి మహారాజుగారి ఆస్థాన పండిత పదవి నలంకరించిరి.

ఇట్లుండగా క్రీ॥ శ॥ 1912 వ సం॥లో శ్రీ సత్యజ్ఞానాంద మధ్వస్వాముల వారు రాజమహేంద్ర వరములో అఖిలనైయాయిక మహాసభను జరిపించిరి శ్రీసంగమేశ్వరశాస్త్రిగారు శిష్యకోటితో ద్విగుణీకృతోత్సాహముతో పెండ్లికి తరలివెళ్ళిన విధముగా ఆ నైయాయిక మహాసభకు బయలుదేరిరి. ఆసభలో వీరి వాదనైపుణి నిరుపమానముగా నున్నందున స్వామి వారు ముదబ్ధి నోలలాడిరి శ్రీ మధ్వస్వాముల వారు శ్రీ సంగమేశ్వరశాస్త్రి గారి సోపపత్తిక వాదవైదగ్ధ్యమునకు సంతసించి,బహువిధముల సమ్మానించిరి.కడకు జీవితములోని చివరి సభలోకూడ పరాజయ మెరుగని పాండిత్యధను డాయన.

ఇక తర్కశాస్త్రమునకు సంగమేశ్వర శాస్త్రిగారు చేసిన సేవ అమూల్యమైనది వీరిపేరు తలచినంతనే పండితులకు సద్యః స్ఫురించునది 'సంగమేశ్వర క్రోడపత్రములు'. తర్కశాస్త్రమను నది నేటికి అయవని శాభ్యంతరమున కనుమరుగైపోవుటచే సంగ్రహ తర్కశాస్త్రచరిత్రను తెలిసికొనుట చాల ముఖ్యము తర్కమనగా నేమి? తర్కశాస్త్రచరిత్ర మెట్టిది? తర్కశాస్త్రమునకు సంగమేశ్వరశాస్త్రిగారు చేసినసేవ యెట్టిది? అనెడి విషయములు విశదీకరణయోగ్యములైనవి.

'తర్క్యతే ప్రతిపాద్యత ఇతితర్కః' అనగా ఊహించి తెలిసికొన దగిన దని తర్క మనుపదమునకు వ్యుత్పత్తి దీనికే న్యాయశాస్త్ర మనునది నామాంతరము. ఈతర్క శాస్త్ర మంతయు అనుమాన ప్రమాణమునాధారముగ చేసికొని బయలు దేరినది. 'గౌతమమహర్షి' న్యాయశాస్త్రమునకు మూలపురుషుడు ఇతడు 'న్యాయ సూత్రములు' అనెడి గ్రంథమును విరచించెను.

ఈ గౌతమమహర్షి న్యాయసూత్రములను లేదా గౌతమ తర్కమును ఆధారముగా చేసికొని మధురానాథుడు జగదీశుడు, గదాధరుడు నను ముువ్వురు న్యాయశాస్త్రమును పెంపొందించిరి శ్రీనాథుని కూర్మి బావమఱదియైన దగ్గుపల్లిదుగ్గన శ్రీనాథుని గూర్చి తెలియ చేయు సందర్భమునందు

'అక్షపాద కణాదపక్షిలోదీరిత
న్యాయకళాకౌశలాతిశయము –

అని పేర్కొనిన పద్యమునుబట్టి అక్షపాదుడు, కణాదుడు, పక్షిలుడు మొదలగు నైయాయికుల సంగతి తెలియుచున్నది దిఙ్మాత్రముగా తర్కశాస్త్ర చరిత్ర యిది. శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు మధురానాథ జగదీశ గదాధరుల మార్గములను సమ్యగవగాహనకు తెచ్చుకొని కర్కశమైన తర్కశాస్త్రమును కరతలామలకము గావించుకొనిరి. సంగమేశ్వర శాస్త్రిగారు తర్కశాస్త్రముమీద తమ కేర్పడిన ఒక విశాలావగాహనను పురస్కరించుకొని క్రోడపత్రరచన కుపక్రమించిరి

'సాధ్యాభావవదవృత్తిత్వమ్' అను పూర్వపక్షీయవ్యాప్తిపై గల పూర్వపక్ష సిద్ధాంతముల కనువుగా అనుగమములను సృజించి పూర్వాపరబంధ సుందరముగా అన్వయించి నిర్దుష్ట సమగ్ర సిద్ధాంతములను ప్రతిపాదించుటయే వీరి 'మాథురీ పంచలక్షణీ క్రోడపత్రము' లో గల విషయము సంగమేశ్వరశాస్త్రిగారిచే విరచితమైన యీ మాథురీపంచలక్షణీ క్రోడపత్రమును మైసూరు ప్రభుత్వము వారు ప్రకటించిరి.

ఇక వీరు రచించిన రెండవ గ్రంథము జగదీశ సిద్ధాంతలక్షణముపై వ్రాసిన క్రోడపత్రము 'హేతువ్యాపక సాధ్య సామానాధికరణ్యము' అను సిద్ధాంత వ్యాప్తి లక్షణమును పురస్కరించుకొని జగదీశపండితుడు' సిద్ధాంత లక్షణము' అను విశాలగ్రంథమును విరచించెను. ఇది యాధారముగా వెలసిన విమర్శ గ్రంథమే 'సంగమేశ్వరక్రోడము' అనునది. క్రోడపత్రము లనగా శాస్త్రముమీద సంగ్రహవిమర్శ లని యర్థము ఏకో యొక విషయమును క్షుణ్ణముగా చర్చించి సారమును చూపుటీయను క్రోడ మని యందురు.

'దీధితి' అనెడి గ్రంథమునకు భవానంద ప్రభృతులు వ్రాసిన వ్యాఖ్యానములు పూర్వము మిక్కిలి ప్రసిద్ధిచెంది యుండుట సకలజనవిదితమైన విషయము. అయినను జగదీశుడు, గదాధరుడు వ్రాసిన వ్యాఖ్యానములు మిగుల సారవంతములై పండితలోకమున ప్రశస్తివహించుటచే అవియే ప్రచుర ప్రచారములోనికి వచ్చి భవానందీయాది ప్రాచీన కృతులు నష్టప్రాయము లైనవి. జగదీశ పండితుని వ్యాఖ్యానమునకు వ్యుత్పాదకమనియు గదాధరుని వ్యాఖ్యానమునకు 'మోహక' మనియు పేర్లు ఇవి యుక్తమైనవే జగదీశ వ్యాఖ్యానమున విషయబాహుళ్యముచే వాని లక్షణములు పలు తెఱగులుగ నుండుటచే ఆచార్యాంతేవాసు లుభయులకు అల్పాక్షరములచే ననల్పార్థబోధకలగుట దుస్తరమగుటయేకాక నిర్దుష్ట పాండిత్య సంపాదనక్షమములు కాలేదు. గదాధర వ్యాఖ్యలో విషయము లధికముగాను వాని యర్థములు విస్తృత వ్యాసరూపమున నుండుటచేత ఉపాధ్యాయ విద్యార్థులుభయులకు అధ్యాపనాధ్యయనములక్లేశకరమగుటచే నిర్దుష్టవ్యుత్పత్తి జనకములు కానేరవు ఈ జగదీశ గ్రంథములకే పఠనపాఠనాదులలో బహుళ ప్రచారముండెడిది. జగదీశగ్రంథముల కెంతగా ప్రాధాన్య మొసగబడినదో అంతగా గదాధర గ్రంథముల కాదరము లభింపలేదు.

అందువలన జగదీశ గ్రంథములలో నొకటియగు 'సిద్ధాంతలక్షణము' అనుదానికి వ్యాఖ్యానము పండిత ప్రకాండులైన శ్రీ గుమ్ములూరి సంగమేశ్వర శాస్త్రిగారు 'సంగమేశ్వరీయము' అనెడి పేరుతో రచించిరి దీనినే 'సంగమేశ్వర క్రోడము' అను పేరుతో ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు 1933సంllలో ప్రచురించిరి ఈ గ్రంథమున సంగమేశ్వరశాస్త్రిగారు అపూర్వములైన విషయముల నెన్నిటినో ఆవిష్కరించి సిద్ధాంతీకరించుటచే వీరి క్రోడపత్రము లన్నిటిలో 'సంగమేశ్వర క్రోడము' ప్రథమస్థానమును సంపాదించినది

ఇదేవిధముగా గదాధరీ యావయవ గ్రంథమునకు క్రోడపత్రమును రచించుచుండగా క్రీ. శ. 1933 సంllము మే 14వ తేదీన శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు దివంగతులైరి అందువలన గంగాధరీయావయవ గ్రంథ మసంపూర్ణమై నిలిచిపోయెను. మనదేశములో తర్కశాస్త్రము పూర్తియైన దనిపించుకొనదలచువారు సంగమేశ్వర క్రోడపత్రముల నవశ్యము పరింతురు ఇరపూర్ణ జ్ఞానప్రదాయకములు వీరి క్రోడపత్రములు

తర్కశాస్త్రమునకు వీరు చేసిన అపారమైన సేవను పురస్కరించుకొని సంగమేశ్వరశాస్త్రిగారికి 'అపరగౌతమ' అను బిరుదము లభించినది ఆ బిరుదు వీరిపట్ల సార్థకమైనది విద్యాధనమువలె వీరికి తరుగని శిష్యసంపద కలదు వారిలో కొందరు ప్రముఖులు

1) బ్రహ్మశ్రీ కాశీ కృష్ణాచార్యులు గారు
2) ,, మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు
3) ,, దూళిపాళ సూర్యనారాయణ శాస్త్రిగారు
4) ,, మరువాడ శంభన్న శాస్త్రిగారు
5) ,, పేరి లక్ష్మీనారాయణ శాస్త్రి గారు
6 ,, గంటి సూర్యనారాయణశాస్త్రి గారు.
7) ,, పప్పు అప్పయ్య పండితవర్యులు
8) ,, దెందులూరి పానశాలశాస్త్రి గారు.
9) ,, మరువాడ పురుషోత్తమ శాస్త్రి గారు
10) ,, కొల్లూరు సోమశేఖరశాస్త్రి ప్రవరులు
11) ,, కొల్లి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు
12) ,, కమ్మర గుంట్ల సీతారామాచార్యులుగారు

పట్టాభిషస్త్ర పండితుల నిప్రశస్తి వహించిన మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు సంగమేశ్వర శాస్త్రిగారి 'సంగమేశ్వర క్రోడము' అనెడి గ్రంథమునకు 'ప్రశస్తి' అనెడి పీఠికను వ్రాసిరి ఈ పీఠికలో 'పితత్వం డిత ప్రవరస్య విజయనగర సమాగనానంతర మహా మపి న్యాయశాస్త్రవివ.యే తదీయ శిష్యకోటిం ప్రవిశ్యస్థితోఽస్మి' అని వ్రాయుటవలన శ్రీ తాతాసుబ్బరాయశాస్త్రిగారు వీరి శిష్యు లని విదితమగుచున్నది.

మహా మహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు తామువ్రాసిన పీఠికలో గురువరేణ్యులైన సంగమేశ్వర శాస్త్రిగారిని గురించి ఒక్కచక్కని అభిప్రాయమును ప్రకటించిరి

'వాద ప్రసంగే అయం చ పండితప్రవరః
ప్రతిపక్షభూతంవాక్పతి మపి మూకీకర్తుం
ప్రభవ తీతి వచనః స్వభావోక్తితా
మాపద్యతే ?

ఇది సంగమేశ్వర శాస్త్రిగారికి మహామహోపాధ్యాయ లిచ్చిన కితాబు. జాన్సన్ అను జర్మనీపండితుడు శ్రీ సంగమేశ్వర శాస్త్రిగారియొద్ద శాస్త్రరహస్యములను గ్రహించెను జాన్సన్ మొదలగు పాశ్చాత్య శిష్యులవలన సంగమేశ్వర శాస్త్రిగారు ఖండాంతర పరివ్యాప్త యశోవిశాలురైనారు పాశ్చాత్యదేశములనుండి వీరికి గౌరవ 'డాక్టరు' బిరుదము వచ్చినది

ఎన్నియో కష్ట నష్టముల కోర్చుకొని

# 11. మిడిసిపడకు

- శ్రీ వెలుదండ నిత్యానందరావు

అందమా పెట్టెలోనుండు - గ్గిపుల్ల!
క్రమ మకుటమ్ముగా నీదు గంధకమును
ఇంద్రభవనమ్ముగా నీదు ఇరుకుగదిని
ఎడవ తలపోసి తలపోసి మిడిసిపడకు.
విజ్ఞవీగకు మిది గుర్తుపెట్టుకొనుము
నిజము తెలుసుకోనీయదు నీ దురాశ
ప్రకృతికాంత చల్లనిజడి పరవశముగ
అన్ని ఋతువులు మధురమా అమనిగను
బ్రతుకుచున్న నీ దివ్యజీవనము నంత
చెరచి, నీయాత్మ, దెగటార్చి చెరబిగించి
రనుచు గుర్తుతెచ్చుకొనుము యాగ్గిపుల్ల
నీదు మకుటభవనములు నీకు రక్ష
సల్పజాలవు వాటి ఘర్షణయె నిన్ను
పూని మండించి గావించు బూదిగాగ.

(The Vulturous Matchwood' written by V C Chakravarthy కి భావానుసరణము ఈ గీతమాలిక )

—*—

తదేక దీక్షతో కర్కశతర్కశాస్త్రము నభ్యసించి తచ్ఛాస్త్ర ప్రచారమునే జీవితాశయముగా స్వీకరించిన ధన్యజీవి సంగమేశ్వర శాస్త్రిగారు నిరంతర మంతేవాసుల కధ్యాపనము చేయుటయే వ్రతముగా నాచరించిన మహనీయు డతడు జీవించినంతకాలము శాస్త్రిగారు తమ యధరస్పందనలో శారదాపాద మంజీర మంజు శింజానములు వినిపించిరి. ఇంతటి పాండిత్య సంపదకుతోడు వీరు నిరహంకారులు నిరాడంబరులు నగుట బంగారమునకు తావి యబ్బినట్లయ్యెను ఇటువంటి శాస్త్రజ్ఞాన దీధితుల నీను పండితరత్నము తెలుగుగడ్డపై ప్రభవించుట నిజముగా మనకొక గర్వకారణము దిగ్దంతులైన విబుధ సత్తములను సృజంచిన యపర విరించను డాయన

# 12. కాళిదాసు - వర్ణనావైచిత్రి

- శ్రీ డి అర్క సోమయాజి

'సంస్కృతం నామదైవీవాక్' అని పతంజలి మహాభాష్యవచనము పైగా 'జననీ సంస్కృతంబు సకలభాషలకును' అని వినుకొండ వల్లభరాయని నుడి ఇట్లు ఆంధ్రేతర కవు లందరిచేత నేకాక ఆంగ్లేతర ప్రాచ్యభాషా కవులచేఁగూడ మన్ననలఁ గాంచినదియును, లోకమున వెలుగొందుచున్న ఐదువందల భాషలయందునూ అగ్రతాంబూలమును గ్రహించి దైవభాషయైనదియును, అయినట్టి భాష గీర్వాణ భాష. శోకమే శ్లోకమై ఆదికవి నోట నుద్భవించి రామాయణ మహాకావ్యమున ఆర్యావృత్తములలో నర్తనములు సలుపుచూ క్రమేణ కవికులగురువు - కవితావిలాసుఁడు, అయిన కాళిదాసుని చేతఁ బడి, రమణీయభావవిన్యాసములతో మందాక్రాంతా వృత్తములలో మంద మంద గమనములతో నేతత్సంస్కృత భాషామతల్లి భాసభవభూతి శ్రీహర్ష బాణభారవ్యాది కవిచంద్రుల కావ్యములయందు నోలలాడి యశోవైజయంతిక లాసేతుహిమాచల పర్యంతము నెగురగా నాటికీ నేటికీ తల్లిభాషగా రాణకెక్కినది. అట్టి సంస్కృత భాషా మహాంబుధికి కాళిదాస కవిచంద్రుఁడు నిజముగా చంద్రుని వంటివాఁడే !

'పురాకవీనాం గణనాప్రసంగే
కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా
అద్యాపి తత్తుల్యకవే రభావా త్
అనామికా సార్థవతీ బభూవ ।'

అనికవుల గణనయందుఁగూడ నితని కగ్రతాంబూలమే ! అట్టి ఈకవికులతిలకుని యపూర్వ మృదుమధుర కవితారచనలు సంస్కృతభాషాయోషకు అలంకారముగ నైక్రుచ్చిన యాణిముత్తెపుసరులు ఈ కవికావ్యప్రపంచమున ఒక మేలిమివజ్రము కుమారసంభవము ఇయ్యది పేరునకు కుమారసంభవమే కాని నిజమునకు జగతికి మాతా పితరులైన గౌరీశంకరుల ప్రణయవిలాసమే ! అట్లు రాణకెక్కిన ఏతత్కావ్య సుమము నందలి తేనెసోనల రుచుల మాధుర్యమునుఁ జవి జూచుచు, కవీంద్రుని ఊహాశాలిత్వమును, భావ సంపదలను, వర్ణనావైదగ్ధ్యమునుకొంచెము పరిశీలింతము

అస్త్యుత్తరస్యాం దిశిదేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః ॥

అని హిమాలయ వర్ణనముతో కావ్యరచన నుపక్రమింపబడినది ఈశ్లోకము హిమవన్నగౌన్నత్యమును రుచిఁజూపుటతో పాటుగా 'ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్' అనుటచే వస్తుమాణ అర్థమును గూడా భాసింపఁజేయుచున్నది అప్పై నగాధిరాజుయొక్క నగ అధిరాజత్వమును సుమారు పదునేడుశ్లోకములలో విపులీకరించి కావ్యమునకు వన్నెలుచిన్నెలుఁ గూర్ప మొదలిడినాఁడు మన కాళిదాసకవీంద్రుఁడు. ఈ మొదటి వర్ణనము ందే ఈ కవిభావనా కల్పము మన మనోముకురముల యందు ప్రతిబింబింపక మానదు ఏతద్వర్ణనా సందర్భమున ఈతని రమణీయ భావవికాసమున కొక్క యుదాహరణమును గైకొని పరిశీలింతము

యచ్చాప్సరోవిభ్రమ మండనానాం
సంపాదయిత్రీం శిఖరైర్బిభర్తి
వలాహకచ్ఛేదవిభక్తరాగా
మకాలసంధ్యా మివ ధాతుమత్తామ్
(1 స 4 శ్లో)

ఈ హైమనగము సింధుర గైరికాది ధాతువులకు నిలయ మట ! దీనినికవీంద్రు డెట్లు చమత్కరించుచున్నాడో ! రక్తవర్ణముతో నలరారుచూ గైరికాది ధాతువులు అకాల సంధ్యా సమయమును దలపింపఁజేయుచున్న వట ! అదిచూచి యచ్చట సంచరించుచు నచ్చరలేమలు సంధ్యాభ్రమలో మునిగి అలంకార రచనమునకై తత్తరపాటుతో బిత్తరపడుచుండిరట ! ఎంతచక్కని ఊహాసంపదయోకదా ! ఇట్టి కల్పన యొక్క కాళిదాసునకే చెల్లినది ఆభావన నాన్యత్రో దర్శనీయము నిజమునకు మనకవి కూడా ఈశ్లోకరచనాసమయమునందు ఆయచ్చరలేమలవలె తానునూ భ్రాంతిమదలంకార రచనమునకై తత్తరపాటు పడినాఁడేమో !

అట్లే ! హిమవన్నగ సమీపములందు నివసించెడు వనేచరుల కీ గైరికాదులు, ఓషధులునూ, రతిక్రీడాసమయములందు అతైలపూరములైన దీపము లగుచున్నవట! ఎంతచక్కని కల్పన ? ఆ ఓషధుల యొక్క పరిణామమును, వానివలన హిమవంతుని పరిణామమును వ్యక్తముచేయుటకు పరిణామాలంకారరచనము గావించినాఁడేమో ? ఒక ప్రక్క వస్తువర్ణనము, మరియొకప్రక్క అవర్ణనముద్వారా హిమనగౌన్నత్యమును పాఠకుల మనంబులకు దృగ్గోచరము గావించిన ఈ కవిచక్రవర్తి మస్తిష్కపు ప్రయోగశాలయం దెన్ని పరిశోధనల జనితములో ఈ భావసంపదలు !

ఇఁక కావ్యమునందు హిమవత్పుత్రియైన హైమవతి వర్ణనము నొక్కసారి తడవి చూచెదము పార్వతీవర్ణనా విషయమున కాళిదాసెంత శ్రద్ధవహించి యుండెనో ఎరుగలేము ఇందు పార్వతీవర్ణనము అంగప్రత్యంగవర్ణనముగానే నడచినను శ్రుతిమించలేదు పాదాంగుష్ఠ నఖప్రభలతోఁ ప్రారంభించి కేశాంతముతో గావించి ఔచిత్య శోభితముఁ గావించినాఁడు.

దేవతల అంగప్రత్యంగ వర్ణనల విషయమునఁ బాదాదినుండి శిరఃపర్యంతమును, మానవుల విషయమున శిరమునుండి పాదముల పర్యంతము వర్ణించుట ఔచిత్యమే కదా! ఈవర్ణనము సుమారు పదిమీద ఏడుశ్లోకములలో రమణీయభావసంపదలు విరాజిల్లునట్లు గావించినాఁడు పార్వతి వళిత్రయము కాముని యారోహణార్థము రచింపఁబడిన సోపానపంక్తి యట! ఎంత చక్కనిభావన! ఆమె యౌవన ప్రాగుర్భావ సోపానపంక్తిని మాకళ్ళముందు గనపరచుచున్నాఁడు ఈపద్యమును (శ్లోకమును) దిలకింపుఁడు!

సర్వోపమాద్రవ్యసముచ్చయేన
యథాప్రదేశం వినివేశితేన
సా నిర్మితా విశ్వసృజా ప్రయత్నా
దేకస్థసౌందర్యదిదృక్షయేవ (1 49శ్లో)

పార్వతీసౌందర్య విషయమున చంద్రారవిందాద్యుపమాన వస్తువుల సముచ్చయము నేకత్రసౌందర్య దిదృక్షతో నామెయం దిమడింపఁజేసి విరించి యామెను సృజియించెనట! నిజమున కీసౌందర్య దిదృక్ష యాపార్వతిని సృజించిన విరించిదిగాదు కావ్యనాయకయైన పార్వతి చిత్రణమునకై మన కవిబ్రహ్మకుఁ బుట్టినదే కాని వేరొండుగాదేమో యని నా భావన! కావున్న కొందరు తమభావము లెదుటివారిపైని వ్యక్తముఁ జేసెడురీతిని మెల్లగా విరించిపై నెట్టినాఁడు! గడసరివాఁడే సుడీ! కేవలము పాత్రచిత్రణవిషయమునకే సరిపెట్టుకొనక మొత్తము కావ్యమునకన్వయించి చూచినచో నొక విధముగా నీకావ్యముగూడ సర్వోపమాద్రవ్యసముచ్చయముతో ఏకత్రస్థితలావణ్యావలోకనేచ్ఛతో నిర్మించినాఁ డనుటలోఁగూడఁ దప్పులేదేమో!

రెండవసర్గయందు తారకాసురబాధల నోర్వలేని ఇంద్రాద్యష్ట దిక్పాలకులు అతని కెట్లు దాసులైనారో సుమారుఒక్కొక్కని కొక్కొక్క శ్లోకమును రచించి వారి శోకతుల్యమైన బాధలను వ్యక్తముగా వించినాఁడు. నిజమునకీ శ్లోకముల రచనా విషయమున నెంతో నేర్పును ప్రదర్శించి ఒక్కొక్క దేవతను కడు రమ్యముగాఁ జిత్రించినాఁడు దేవతల ముఖములన్నియు హిమక్లిష్టప్రకాశములైన నక్షత్రములవలె నున్నవనినాఁడు ఇఁట గూఢముగా తారకాసురుని ధ్వనింపఁ జేసినాఁడేమో? నక్షత్రములకు పర్యాయపదము తారకలుగదా ఇఁట దేవతలయొక్క వదనములు హిమక్లిష్టప్రకాశములైన తారకలు ఈతారకల కసురుఁడు తారకాసురుఁడే కదా?

ఇఁక వసంతవర్ణన విషయమున కాళిదాసుని ప్రతిభకు పట్టపగ్గములే లేవేమో! 'ఋతూనాం కుసుమాకరః' అని కదా! గీతావాక్యము పైగా ఋతురాజుగూడా కాబట్టి ఈకావ్యమున మొదటఋతువర్ణన 'వసంతము'. ఈవర్ణన సుమారు పదిమీదనైదు శ్లోకములలో గావించి కుమారసంభవమునకై మారుని రంగమున దింపినాఁడు. ఋతువర్ణనా విషయమున ఆయాయిఋతువులకు ప్రాణప్రాయమైన విషయములను జిత్రించుటలో నితని పరిశీలనా కౌశలము అయత్నస్ఫూర్తి కొట్టవచ్చినట్లు కనబడుచునేయుండును ఇతరవర్ణనములన్నియు నొకయెత్తు ఋతువర్ణనమన్న నొకయెత్తుగాఁ గనబడును దీనికిఁ గారణ మెంతయైన ఋతుసంహారకావ్యము కదా! ఆవాసన ప్రతికావ్యసుమముపైకీ పోక మానదుగదా! ఇట్టి తావులయందు తినయూహాశాలిత్వమును, భావనా పటుత్వముఁ బ్రదర్శించుచునే యుండును ఇందలి వసంతవర్ణనారామణీయకతకు మూలద్రవ్యము నాదికవి రామాయణమునుండి ప్రోవుచేసి దానికి చిన్నెలు కూర్చుచూ తుది మెరుగులతో దిద్దితీర్చినాఁడేమో! ఒక్క శ్లోక ముదాహరణముగా స్వీకరించెదము గాక!

పర్యాప్తపుష్పస్తబకస్తనాభ్యః
స్ఫురత్ప్రవాళోష్ఠమనోహరాభ్యః
లతావధూభ్యస్తరవోఽప్యవాపు
ర్వినమ్రశాఖాభుజబంధనాని (3స 39శ్లో)

పైశ్లోకమునందు లతలకునూ, తరువులకునూ సైతము మన్మథోద్దీపనమును గల్పించినాఁడు మనకవీంద్రుడనవచ్చును. ఏలనగా లతలకు నిండుపూగుత్తులు పాలిండ్లట! లేఁజివురాకులే అధరోష్ఠము అట! అట్టి లతా వధువులవలన తరువులు ఆలింగనసుఖ మనుభవించిన వట! ఇందు తరులకును, లతలకును మానవత్వము నూహగావించి వర్ణించుటలో విశేషమూ లేకపోలేదు కాళిదాసు ఒక్కొక్కతరి ఒక్క భావము వలన రెండర్థములను ధ్వనింపఁ జేయుచుండు ననుకొంటిమి. ఇచ్చటకూడ నొకప్రక్క వసంత విజృంభణమును వర్ణించుచున్నాడు మరియొక్క ప్రక్క కథాభాగము వదలిపెట్టుటలేదు. ఇచ్చట కథను ధ్వనింపఁజేయుచు భావికథను సూచించుచున్నాడు తరువులు స్థాణువులుగదా! అట్లే శివుఁడు గూడా స్థాణువేకదా! అట్టి శివుఁడు లతవంటి పార్వతి సౌందర్యమునకు దాసుఁడౌ నను విషయముఁ జెప్పుట కీకల్పనము గావించెనేమో!

ఇట్టి కవి కవితారామణీయకత గ్రంథమందంతటనూ సముద్రమునందలిఅమూల్యవస్తువులవలె (మౌక్తికాదులు) దొరుకుచునేయుండును వెదకికొనుటకు మన కోపిక కావలయునుగాని అదొక్కటే తక్కువ మనకు ఇట్లే గ్రంథమంతా పరిశీలించిన మన స్వల్పజీవిత మొక్క కావ్యమునకే చాలదు. ఇతరములేల? ఇంకనూ ఈవర్ణనా ప్రతిభను వర్ణించుకొనుచూ పోయిన వ్యాసము బహువవును కాన ఇతర రహస్యములను ఎరుగువరులు కావ్యమును జూచి యందలి రమణీయ భావములను మాధుర్యములను చవిచూచెదరుగాక! కాళిదాస కవీంద్రున కివే నా కైమోడ్పులు

# 13. ఆంధ్రసాహిత్యము - హాస్యరసము

- శ్రీ వసంతరావు రామకృష్ణారావు, ఎం. ఏ

ప్రతి సాహిత్యమును శబ్దరూపమును దాల్చియున్నది ప్రపంచములో, ఏ సాహిత్యమైనను, కొన్ని సమాన గుణ ధర్మములు కలిగియుండును దోషరహితములు గుణసహితములు, రసభరితములు అయిన శబ్దములు, అర్థములు కలది సాహిత్యము సాహిత్య లక్షణములను నిర్ణయించుసందర్భములందు ఆలంకారికుల మధ్య అనేకములైన అభిప్రాయములు కలవు కాని, సాధు శబ్దార్థములతో కూడినది సాహిత్యమని వారందరును అంగీకరించియున్నారు.

ఆంధ్రసాహిత్యమునందలి శబ్దావళి, అనూనమైన గానమాధుర్యముతోడను, రసస్ఫూర్తితోడను, నిండియుండి, సజీవమై, మనోహర భావవిలసితమై సద్యః పరనిర్వృతిని కలిగించి, సాహిత్యము యొక్క పరమ ప్రయోజనమును సాధించుచున్నది - అది ఉదాత్త కల్పనములతో, ఉత్తమ శిల్ప లక్షణములతో, నిరత నిరవధిక రసానంద సంధాయకమై సాహిత్యమునందు, సత్యమును, సౌందర్యమును సమగ్రమగురీతిని స్ఫురింపచేయుచున్నది

ఆంధ్రసాహిత్యము ఆనందరసోత్పాదక - సాధు శబ్దార్థ సహితము - కావుననే 'దేశభాషలందు లెస్స' అను ప్రశంసను పొందినది! పాశ్చాత్యులచే 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అనియు కొనియాడబడుచున్నది - సంస్కృతములోని గాంభీర్యము, ద్రావిడ భాషలోని సరళత్వము, ఆంధ్రవాణిలో పాదుకొనియున్నవి. గానమునకు రాగము ప్రధానమైనట్లు, సాహిత్యమునకు రసరామణీయకములు ప్రధానములు ఆదికవి, నన్నయ నాటినుండి నేటివరకును 'ఇంతింతై . తానింతై నభోవీధిపై నంతై ' మధురముగా, మంగళకరముగా - ఆంధ్ర సాహితీ స్రవంతి, ప్రజాజీవనవాహినితో, పెనవేసికొని, ప్రవహించినది ఒక్కమాటలో చెప్పవలెనంటే, ఆంధ్రసాహిత్యము, నీటుగానుండి, తేటతెల్లని పద జాలముతో నిండి, చదువరులహృదయము లందు తీయని తేనియ లూరించి, తన్మయత్వమును కలిగించునట్టిది

మానవునకు సౌందర్యతృష్ణ అధికము. అందు ముఖ్యముగా, కవులును, కళాకారులును, అనిర్వచనీయమైన సౌందర్యారాధనమే, జీవనసాధన మను భావముతో, రసస్పష్టిని కావించుచున్నారు దానివలన మానవుల జీవనమునందు రసస్ఫూర్తి భాసించుచుండుట గమనింపదగిన విశేషము.

పూర్వము, కవిత్వము, ప్రధానముగా, రాజుల, పాలకుల, జీవనమునకు సంబంధించి యుండినది రాజులు కొందరు, కవిరాజులై, కవిత్వమును పోషించిరి - ఎందరోకవుల కావ్యసృష్టికి వారెంతగనో దోహదముచేసిరి - కవులు కూడ ఆనందాస్పదమై, రసోత్పాదకమైన, మనోహారత్వమును మంజులత్వమును కొనసాగించిరి. ఆనాటికవుల జీవితములు భోగ భాగ్యములకు తావలములై ఉండినవి - అందువలననే, 'నిరుపహతి స్థలంబు - రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము- ఆత్మకింపయిన భోజనము- ఉయ్యెలమంచము' నుండిననే కాని కవిత్వము సాగడిదికాదు! నిజమే మరి-

'చెప్పవలె గప్పురంబులు
కుప్పలుగా పోసినట్లు - కుంకుమ పైపై
గప్పిన క్రియ - విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్'

ఆవిధముగా అలనాటి కవులు ప్రవహింపచేసిన కవిత్వము ఒక మధురమైన అమృతధార! అంతేకాదు-

'చెవులకు జవులై చల్లగ
కవులకు దవులై - సమస్తకావ్యకళాబంధువులై - రససింధువులై-
అవురా యని కవిత లవని నలరగవలదా?

అవురా అనునట్లుగనే ఆనాటి కవిత్వము వెలసినది. పూర్వకవులు, సమకాలీన భావప్రతినిధులై, ఆనాటి సామాజిక, రాజకీయ జీవనపరిస్థితులను తమకావ్యములందు ప్రస్ఫుటముచేసిరి - ఆంధ్రభాషా సరస్వతికి, అలంకారములుగా, అమూల్యమైన, కావ్య రత్నములను సమర్పించిరి!

రాజుల జీవనమునకు సంబంధించిన కవిత్వమునకు శ్రీ తిరుపతి వేంకటకవులు స్వస్తిపలికిరి తొలిసారిగా, వారు ప్రజలకు కవిత్వమును అందించినారు. ఒకవంక ఉత్తుంగ తరంగమువలె లేచిన భారత జాతీయ ఉద్యమము - వేరొక ప్రక్క భావసంచలనము కలిగించిన, సమాజమునకు నూతనలక్ష్యములను నిర్దేశించిన, రచనాఉద్యమమూ కొనసాగినవి ఆధునిక సారస్వత చరిత్రలో, కందుకూరి, గురజాడ, గిడుగువంటి భాషాసేవకుల పాత్ర అనన్యమైనది!

కవి ఒకనిరంతర స్రష్ట - నిత్యకావ్య నిర్మాత కవి మానసికస్థితి మృదులము కవుల భావ సంచలనము వ్యక్తి వికాసమునకు, సామాజిక సంస్కరణమునకు దారితీసినది

మన కావ్యములందు కవులు, సముచితమైనరీతిలో, నవరసములను పోషించిరి కరుణ రస ప్రధానమైన కావ్యములు జన సంభావ్యములై విలసిల్లు చున్నవి అయినను హాస్యరసపోషణము నందు, మన పూర్వకవులు అంతశ్రద్ధ చూపినట్లు కనుపించుట వాస్తవమున్నను, హాస్యమువలన సాహిత్యమునకు ప్రయోజనము చాల కలదు ఏకారణముచేతనో పూర్వులు, మనకవులు హాస్యమువలన సాహిత్య ప్రయోజనమును అంతగా గుర్తించలేదు. సున్నితమైన, సునిశితమైన, హాస్యరసము నే వారు తమ కావ్యములందు ప్రవేశ పెట్టిరి హాస్యము చదువరుల వినోదము అనునది వారి ఆశయమై ఉండవచ్చును. మరియొక కారణము ఆకావ్యములందు సృష్టింపబడిన హాస్యమునకు సంస్కృత నాటకములు, కావ్యములు మూలములై ఉండుట! సంస్కృత నాటకముల గాని, విదూషకపాత్ర కేవలము హాస్యరస ప్రధానమైనది దానివలన ప్రయోజనము సాధింపబడదు కొన్ని విదూషకపాత్రలు హాస్యమును అందించలేక పోవుటయు కదు మృచ్ఛకటికములోని శకారుని పాత్ర సరసమైన హాస్య రస స్వరూపమును ధరించ లేకపోయినది

హాస్యము నవరసములలో ఒకటి - 'విభావానుభావ వ్యభిచారి భావసంయోగా ద్రసనిష్పత్తిః' అని భరతముని రసనిర్వచనము చేసెను హాసజనకమైన, అలౌకికానంద ప్రదమైన, చమత్కార కల్పనము హాస్యము అనబడును - అనగా నవ్వును పుట్టించునది హాస్యము చిత్ర రచన, శిల్పము సంగీతము మొదలైన కళలవలెనే, హాస్యమును ఒక చక్కని కళాకౌశలమే! సాధారణముగా, ఆనందమయమైన, మానసికస్థితి ఉన్నప్పుడే హాస్యము పుట్టును

ఆచారవ్యవహారములందు, వేషభాషలందు, అలవాటుగా నున్నపద్ధతికి భిన్నముగా ఉన్న విషయము నవ్వు పుట్టించును. కాని మంద ప్రజ్ఞులకు నవ్వు కలిగించునది హాస్యము అనిపించుకొనదు. సహృదయులకు ఆనందము కలిగించునదియే హాస్యము. రమణీయార్థ ప్రతిపాదకమైన ఒకమాటగాని, ఒక చేష్టగాని, హాస్యమును కలిగించుచుండును. అట్లని నవ్వును పుట్టించునది అంతయు హాస్యమని అనుకొనరాదు.

జీవితమునందలి అనేకములగు విచిత్ర లీలలు కళా సృష్టికి కారణ మగుచుండును ఆసృష్టి హాసజనకమైనచో అదియే హాస్యము. కాబట్టి జీవితవిలాసములను, విచిత్రములను ప్రతిపాదించుటయే హాస్యముయొక్క ప్రయోజనము అని చెప్పవచ్చును.హాస్యశీలుడు,జీవితములోని సుఖదుఃఖములను, మంచి చెడులను, తన అనుభవములోనికి తెచ్చుకొని సత్యమును వెలయించి, అసత్యమును నిరసించును జనులను నవ్వించుట అనగా వారికి దేవత్వమిచ్చుటయే. చమత్కారశీలు డొక్కడే ప్రజలకు ఆనందము నందించుచుండును. అతడే విరుద్ధ ధర్మములుగల యీవిచిత్ర ప్రపంచమును, విభిన్నతత్వములు గల అనేకులను, ఒకేదృష్టితో ఆనందముతో చూడగలడు!

ఆంగ్లరచయిత అడిసన్ హాస్యమును నిర్వచింపుటకన్న, హాస్యము కానిదానిని సూచించుట సులభ మని చెప్పెను. హాస్య రససృష్టికి, మృదువైన మానసికస్థితి అవసరము. కళామయము, రసోద్దీపనము కాగల స్వభావము హాస్యరచనకు కారణము కవి, గాయకుడు కళాకారుడు మున్నగువారివలె హాస్యశీలుడు, సత్యమును, సౌందర్యమును సమానదృష్టితో సందర్శించును. కాబట్టి, హాస్యరచనము ఒక సమున్నత కళావిశేష మనదగియున్నది

హాస్యము, శబ్దాశ్రయమనియు, అర్థాశ్రయమనియు రెండు విధములు. కేవలము, మాటల కూర్పుచేతనే, హాస్యముత్పన్నమైనచో నది శబ్దాశ్రయము. 'సాక్షి'లో ఇట్టి శాబ్దికమైన చమత్కారము విస్తారముగా కలదు. పానుగంటి వారు తమవచన రచనలో, శబ్దవైచిత్రితో ఒక క్రొత్తదారిని త్రొక్కిరి సాక్షి ఉపన్యాసములలో, ప్రతిపదమును పరిహాసగర్భితము, ఆక్షేప భరితము, నై ఉన్నవి అర్థాశ్రయమైన హాస్యములో వ్యంగ్యస్ఫూర్తి ప్రధానముగా ఉండును. అర్థాశ్రయమైన హాస్యము, ఉక్తిమూలమనియు, శక్తిమూల మనియు మరల రెండు విధములు. ఛలోక్తి, సరసోక్తి, నర్మోక్తి మొదలగునవి ఉక్తిమూలమైన హాస్యవిభేదములు

హాస్యదృష్టి మానవునిచిత్తప్రవృత్తిపై ఆధారపడియున్నది చమత్కారశీలునికి, జగమంతయును హాస్యమయముగా కనుపించుచుండును హాస్యము మానవజీవితమున కొన్ని ప్రయోజనములను సాధించుచున్నది. హాస్యరచనముద్వారా సామాజిక సంస్కరణమును సాధిపవచ్చును. ఆనంద విలాసములను ప్రతిపాదించుటకే కాక, అసత్యమును నిరసించుటకు హాస్యముపకరించును చమత్కారశీలత,లోకాతీతమైన ఒకదివ్యశక్తి హాస్యమునకు ప్రసాదగుణము ముఖ్యము. సహృదయత, విశాలదృక్పథము, అవసరము హాస్య ప్రయోజనము, కావ్య ప్రయోజనమును పోలిఉండును చమత్కారకల్పనము ఒక కమనీయశిల్పము. అదిహృదయ వికాసము

నకు, సత్యసౌందర్యముల సందర్శనమునకు ఆనందోత్పాదనమునకు తోడుపడును

ఆనందరసము నాస్వాదించుటయే, లలితకళల లక్ష్యము. హాస్యమున, రామణీయకతకు ఒకవిలక్షణస్థాన మున్నది. చమత్కారశీలుండును, ఏది సత్యము, శివము, సుందరమో, దానినే సందర్శించి అలౌకికమైన ఆనందమును అందరికిని పంచిపెట్టుచున్నాడు! కవిత్వ కల్పనా శక్తి అనన్యమైనది. ఈ భూతసృష్టి అంతయును, హృదయపరిణతిగల చమత్కారశీలునకు అత్యంతము ఆనందదాయకమైనదే అనుటలో అత్యుక్తి లేదు. సృష్టి అంతయును ఆనందమునుండి పుట్టుచున్నది. ఆనందము నందే వృద్ధి చెందుచున్నది ఆనందము దిక్కునకే ప్రయాణ మగుచున్నది. తుదకు ఆనందమునందే స్థాయిని పదుర్చుకొనుచున్నది కావున ఆనందప్రదమైన, అనుభవైకవేద్యమైన హాస్యశీలత మానవజీవిత పరిణతికి కారణ మగుచున్నది.

చిత్తవిస్తారకారకమైన హాస్యరససృష్టి శాశ్వతమైన, నాశనములేని, సత్యము యొక్క స్వరూపమును వెల్లడిచేయును. ఒకమాట విరుపు, సమయస్ఫూర్తిగల ఒక తీవ్రభావము హాస్యమునకు వస్తువగును. చమత్కారకల్పనము హ్లాదకమయ్యైనది. అనన్యపరతంత్రమైనది. నవరసరుచిరమైనది.

# 14. పరమానంద మునీంద్రులు

– అష్టావధాని శ్రీ కాపూరి పూర్ణచంద్రరావు, ఎం.ఏ., బి.ఒ.ఎల్.

* కోటి వచించినన్ గుదురు
  కొన్నది నాయెదం దత్త్వచింతనో
ద్ఘాటితవస్తువ త్ర్యదియ
  కావ్యము గాఁ బొనరించి నాజనుః
కోటి దురంత దుష్ట భయ
  కోటి తొలంచెద తామరాకుపై
నీటి కణంబులోని రమ
  ణీయ భవాశుభ వాప్తిఁ జాటుచున్.

♦ జడముల కజడంబులకును
పొడవడు చంద్రార్క పంచభూతంబు
కడలకు నునుపుల కేయది [లకున్
తడవిన మూలంబు దానితలఁ చెద నెపుడున్

♦ ముత్తంబు శబ్దంబు ముద్దబంగారంబు,
  సంగీత సాహిత్య సకలకావ్య
శాస్త్ర సంచయములు చంచద్విభూషాళి,
  'అసలు' కంటెను వడ్డి పసలు జిమ్ము
నాత్మత త్త్వంబును శుద్ధసత్త్వంబును
  కలితోరజస్తమో గంధిలంబు
ఒక్కడే యయ్యును పెక్కురూపంబుల
  నటియించునట్టి సనాతనంబు

♦ దానివర్ణింతు, లోకు లిద్దాని జూతు
రే? ప్రశంసింతురే? యన నేల? అమృత
మెల్లని జనులు నానంద ముల్లమునకు
క్రియము సేయని వారలు పృథివి గలరె?

♦ ఆమహితాత్మశక్తి బడి
  యంతములేని ఖగోళమందు ని
ష్ఠ మహనీయసద్విధి న
  సంఖ్య మలేఖ్య మనూహ్యమై ఉడూ
ద్దామ పరిభ్రమాధిగమ
  ధార్ష్ట్యము కొండగనిచూచువాని సం
ధామతి లోఁ గొనున్ హృదయ
  తర్పణమై భగవద్విలాసమై!

* లెక్కకందని పరిమాణ రిక్షములు, సు
దూరమై, చిన్నవై, రుచి మీరుచుండ
లెక్కయే లేని చిన్నధరిత్రి పెద్ద
నంచు సవిత చుట్టు పరిభ్రమించుచుండు,

♦ ఈ మట్టి యుండయందున
భూమములా నైదు ఖండములు, పారావా
రామిత జలములు నగములు
శ్రీమదరణ్యాళిసృష్టి చెలగుచునుండున్.

* పాకుడ కరళ్ళపై తేలియాడెడి
  మీగడ తరగల మిసుము లనఁగ
స్వచ్ఛసాత్త్వరస ప్రవాహంబుమీరి, ఘ
  నీభవించిన హిమానీధును లన,
విశ్వాంత రాళ సద్విజ్ఞాన మయరూప
  జంగమ వేద పుంజంబు లనఁగఁ
చేతినై పుణ్యంబుచే బ్రహ్మపోసిన
  అచ్చంపు టమృతంపు టచ్చు లనఁగ
భూమి చరియించు స్వర్దేవ పుంజ మనగ
నుందు రాఋబుషుల్ భరతోర్వియందు
లోకకళ్యాణ భావనాలోలసతత
యజ్ఞయాగ క్రియా సమాహ్లాదు లగుచు

♦ నిరత శ్రుతిహితసుస్వరయుక్తిగ్విజపాణి
  తరుశాఖ వేదమంత్రతతి సదువ
సతతమానిత్యవ్రతాచార హారి హారులు
  దరులందు నరగంట తపసేయ
యజ్ఞహవిర్వ్యాప్త హవ్య వాహానదీప్త
  లనిశంబు కుట శిఖాగ్రాలఁ గ్రాల
హింసావిదూర రిరంసామనోవృత్తి
  నరిజంతువెప్డు సోదరత నెరప
పరమ మునికృత మంత్ర శబ్ద ప్రభావ
పూత పులకిత తనువైన భూతధాత్రి
మనుజకోటికి సకల సంపదల నిడగ
మెఱయుబుషివాటికలుకొన్ని భరతధరణి

♦ అందొక యెడ సుందర వన
మందున పుణ్యాశ్రమంబునందున పరమా
నందాఖ్య నెసంగెడు ముని
బృందారకుడొకడు గలడు విశ్రుతకీర్తిన్

♦ ఆతడు శిష్యవత్సలుడు
  యాగవిధానుపథానువర్తనం
డాతడు బ్రహ్మకల్పుడు మ
  హత్తర దివ్యవిభూతి సాధకుం

డాతడు సర్వలోక విది
తాత్మ పరాపరభవ్య భావకుం
డాతనిఁ జెప్పబూనిన న
రాకృతిగొన్న పరాత్పరుం డిలన్

♦ ఆతడధ్యాత్మ దివ్య విద్యాధికతన
పృథివిలోపల చేయలేనిదియు లేదు
ఆత్మ సంతుష్టి కవధిగానైన కతన
పొదల మదిలోన వాంఛించునదియు లేదు.

♦ తెల్లవాఱక, మునియు నదీమతల్లి
పావనులు నూ! పరస్పర స్పర్శచేత।
తెల్లవాఱిన ఋషిపతి దినపతియును
జగతి వెలయింతు రాత్మ తేజంబుచేత !

♦ తొంబదిపాళ్ళు దైవముగ
తోచెడు వానిముఖంబు గాంచి ప
ట్నంబుల మానవుల్ చని వ
నంబులలో వసియింపగా నర
ణ్యంబులె పట్టణంబులు జ
నస్థలులే వన భూములౌచు మో
క్షం బరచేతిలో నమలకంబయి
లోకము సాగువేళలన్.

♦ ఎల్లవారికి బ్రహ్మంబ దెట్టులుండు
నెప్పుడెట్లు కాంతు మటన్న యిచ్ఛగాని
ఎట్లు భోజనం బీబ్రతు కెట్లటంచు
జీవితంబున నవమంత చింత లేదు!

♦ అమ్మవానీయు డా భువిరు
హంబులమధ్య శిలావితర్ది పై
నెమ్మి వసించి వేదగత
నిర్వచనంబులుచేయువేళ, భా
వమ్ముల నాత్మభావ విభ
వంబుల శిష్యులు గొల్వనొప్పవో
యమ్ముగ మేఘమాలికల
మధ్యను చుక్కలలోన చంద్రుడై
♦ అతడా మాదిరి నొక్కనాడట నుప
న్యాసామృతాసార వ
ర్షిత కౌతూహల శిష్యుడై వెలయ న
ర్థిన్ వచ్చి వేవేగ నొ
క్కతడెవ్వాడొ! పదంబులంబడియెఁ బ్ర
క్కంగ గల్గువారల్ సమా
మతవిస్మేర ముఖంబులం గనగ
సాష్టాంగ ప్రణామంబుగన్ *

# 15. పద్యం విలువ

— శ్రీ ఆనంద



పూర్వం,చాలాపద్యాలుండి, అందులో నాయకుని వృత్తాంతం అంతా వుండి వర్ణనలుంటే దానిని మహాకావ్యం అనే వాళ్ళు ఆతరువాత దాన్నే కుదించి కొద్ది మార్పులతో ఖండకావ్యంఅన్నారు చివరికి నాయకుని వృత్తమూ వగైరాలని వదలి ప్రతిపద్యానికీ సంబంధసాహిత్యరాహిత్యాలతో శతకాలని తయారుచేశారు తరువాత మరింతతక్కువసంఖ్యలో ఖండికలు తయారుచేశారు చివరికి తమ సంతాపసమ్మోదాల వ్యక్తీకరణకై పద్యాలని ఉపయోగించారు కొందరు దినచర్యలు వగైరాలకికూడా పద్యాలని వాడారు 'పద్యం' శైలూషికలా బహుభూమికలని ధరించింది పంచరత్నాలు, నవరత్నాలు వగైరాలు తయారైనాయి. ఎవరైనా వస్తేపద్యం పోతేపద్యం,ఉంటే పద్యం ఉండకపోతే పద్యం, కలిస్తే పద్యం కలవకపోతే పద్యం, యిలా పద్యాన్ని బహుముఖంగా మన కవులు' వాడుకోవడం మొదలెట్టారు

పద్యాన్ని మందుల ప్రచారానికి వాడుకున్నవాళ్ళూవున్నారు ఇలా పద్యం యిన్నిరకాలుగా నలిగినలిగి వకుళమాలిక అయిందో మగోటిఅయిందో విచారించిన వాళ్లెవరు ?

అసలు పద్యంయెందుకు అనే యీ రోజుల్లో 'పద్యాన్ని' గుర్తించుకొని కనీసం 'రామలింగని గుజ్జంలా' అయినా గీసేవాళ్ళున్నారని సంతోషించక యెందుకీ పరికిమాలిన విచారణ అనేవాళ్ళు కొంతమంది పద్యం యేమయితే మనకెందుకు మనసంగతికాదుగదా అనేవాళ్ళు మరికొందరు. ఈపద్యాన్నే సహకారరంగలో వుంచిన మహానుభావులు మరికొందరు. ఈపద్యాన్ని గురించి యిందరిన్నిరకాలైతే మాట్లాడకుండా వున్న ప్రప్రథమ ప్రబుద్ధవ్యక్తి పద్యమే

పద్యవిన్యాసం రచయిత నేర్పుకి దర్పణం స్పందన పద్యానికి పరమావధి అనుకుంటే దాన్ని ఒక పద్యంతోను, చాలా పద్యాలతోను, ప్రతీపద్యంతోనూ సాధించినవారున్నారు ఉంటారు మనుషుల్లో వున్నవిభాగాలు పద్యంలోనూవున్నాయి. పద్యంమూలాన కలిగే స్పందన ముఖ్యం అనేవారున్నారు. పద్యానికి ముడి పదార్థాలైన శబ్దార్థాలలో దేనికి ప్రాధాన్యం వున్నట్లు ? ఒకదానికేనా ? రెండింకీనా ? అనుభూతి లేక స్పందన కలగడానికి శబ్దార్థాలలో సహకారిత్వం దేనికి లేక వేనికి ? అర్థమే దానికి మూలం అనుకుంటే మరి శబ్దంస్థితి యేమిటి ? కాదు శబ్దమేఅనుకుంటే అర్థంగతి యేమిటి ? అలా కాదు శబ్దార్థాలు రెండూ సమపాళంలో ఆ అనుభూతికి లేక స్పందనకు సహాయకారులౌతాయా ? పద్యాన్ని విమర్శించేటప్పుడు ప్రాచీనులు చూపిన, మార్గాల్ని, లాక్షణికుల నిర్ణయాల్నీ, పాటించాలా వద్దా ? ఎంతవరకు పాటించాలి ? పద్యానికి తగిందేది ? తగనిదేది? 'కాదేదీ కవిత కనర్హం'అనేమాట అనేకార్థాల నిస్తోంది' కాదు ఏదీ, కవితకు అనర్హం' అనీ, కాదు ఏది యీకవితకు అనర్హం అనీ, యిలా కాకుస్వరాదుల్ని బట్టీ, బహువిధాలుగావుంది వక్తృవివక్షు, శ్రోతృవివక్షు, యివి రెండూ గమ్యార్థాన్ని సులభతరం చేస్తాయి పద్యవిన్యాసంలో అనుకరణ ఒకటి నాగరికతగా చలామణీ అవుతోంది. అభిమానకవి రచించిన వృత్తాన్ని యథాతథాను ప్రాసలతో నిర్వహించి అభిమానులచే 'అభినవ అభిమానకవి' అని సహకార

రంగంలో ప్రగతిసాధించిన ప్రగతిశీలురకు మనం మార్గదర్శకులం మన ఆంధ్రత్వం యిట్టివాటిలో అగ్రగామిగా వుంది.

పదవిన్యాసం, అర్థస్ఫూర్తి, వక్తవ్యార్థానికి, ఆరసానికి అనుగుణంగావుండడం ధర్మం. కాని దానిని చూచేవా రెవరు? ఎవరైనా చూపితే దాన్ని సహృదయతగా భావించరు చూపించడం సహృదయతకా దంటారు. అనుకరణ ఆర్థికంగాను శాబ్దికంగాను తగనిపని అనియెవరూ అనుకోరు పద్యంలో 'అరువు' భాగాలన్నీ పోతే మనదంటూ మిగిలిందేమిటి? ఈ అనుకరణ వైదగ్ధ్యం అనుకొనే కాలంలా వుంది మనపద్యాల్లో మన దెంతో యితరుల దెంతో సరిచూచుకోడానికి, లేదా మరొకరు సరిచూడడానికి అంగీకరించని మనం యేవో కొన్నిపద్యాలు వ్రాసి మనకు మనమే మహాకవులమూ, విమర్శకులమూ అయి మరొకరిని పరిశీలించ నారంభిస్తాము పరదోషేక్షణ దివ్యచక్షుః, యిత్యాదులు మనవే. అభిప్రాయాలచే గుర్తింపబడిన మనం గుర్తింపుదార్లతో సమస్కంధులమూ, వున్నతులమూ అవుతాము

ఇట్టి పద్యాలపై అభిప్రాయాలు మొదలైనవి చాలవరకు ప్రహసనసమాలు దాదాపు ఇవీ సహకార రంగంలోనికే వస్తున్నాయి మావూరికి మీవూరెంత దూరమో మీవూరికి మావూరూ అంతే దూరం గదా!

పద్యంలో వక్తవ్యార్థానికి చారుత్వం రావాలని వక్రోక్తులను ఆశ్రయించడం రివాజు. కాని ఆ ఆశ్రయంలో కొంతైనా ఔచిత్యం వుందా లేదా అనే ఆలోచనే రాకపోవడం మన అదృష్టమో దురదృష్టమో మరి ఉదాహరణకి ఎవరోమహానుభావులు గతించారు వారిపై తమకు గల గాఢమైనభక్తి శ్రద్ధలని వ్యక్తం చేయాలనుకొండి. మనకు తోచిన భావాన్ని పద్యంలోనో గద్యంలోనో యిమిడ్చి దానిని 'బట్వాడా' చేయజూస్తాము. దానికి చిరునామా కావాలిగదా! అశ్రుతర్పణము అని పేరు పెడ్తాము అశ్రువులతో తర్పణ మేమిటి? తర్పణలు వదులుతుంటే అశ్రువులు వచ్చాయనా? అశ్రువులతో తర్పణం అనా? యత్తచ్ఛబ్ద విన్యాసవాక్యము సంస్కృత మర్యాద అట్టి వాక్యాలని సంస్కృత నుండి తెనుగులోనికి తెస్తే యథాతథంగా అయితే ముక్కస్య ముక్కార్థః అవుతోంది కదా! ప్రాచీనుడూ మన కష్టుడూ అయిన కవి దాని నలా వాడాడు కాబట్టి మనమూ వాడాలి ఆయన కాలంనాటి భాషావిన్యాసాలకి ఇప్పటికీ తేడావుందా? ఈరకమైన భావదాస్యం మనల్ని వదలినట్లగపడదు ఒకాయన చాలా గొప్పవాడు నిజమే ఆయన హిమాలయాలలో సాధనచేసి వుండవచ్చు అంతమాత్రంచేత 'తత్తపశ్చర్యకుం దావలంబు హిమాలయము మహిమాలయంబై తనర్చె' అని అనడం బాగుంటుందా? ఇంగులో తత్ శబ్దం, నాలుగుపాదాల తరువాత 'ఎవ్వడాతండు' ఇత్యాదిగా మరో వ్యక్తిని చెప్తుంది ఆవ్యక్తి యెంతగొప్పవాడైనా, అందులో సందేహం లేదనిముక్తకంఠంగా ఒప్పుకొన్నా ఆమహానుభావుని తపశ్చర్యచే హిమాలయంమహిమాలయమై తనర్చిందనడం యెంత సంభావ్యం? హిమాలయ మహిమలు పూర్వకాలంలో కవులచే వర్ణితములు. ప్రస్తుతం మహిమ ఉన్నట్లు అనుకోవడం లేదుకదా ఇట్టి స్థితిలో ఆ వ్యక్తి తపశ్చర్య చే హిమాలయం మహిమాలయమైందా? ఇది యెంతసంబద్ధం? కరుణరసవ్యక్తిలో 'హిమాలయం మహిమాలయం' అని శబ్దాలంకారతాపత్రయం బాగుందా? ఇలాగే 'తన్మహోపన్యాస ధన్యవాగ్ఝరి గాంచి వార్ధిభామిని విష్ణుపదము బట్టె' ఇక్కడ విష్ణుపదం ఆకాశవాచకమా విష్ణుపాదవాచకమా? ఇలాగే 'తనవాభాగవతాధ్యాపనము నెంచి పటపట శుకమాని పండ్లు కొఱికె' ఇక్కడ ఆ మహానుభావుని భాగవతాధ్యాపనానికి శుకమహర్షి పండ్లుకొఱకడ మెందుకు? శుక మహర్షికి గల వైదాంతికజ్ఞానం ఆనుభవికమహత్త్వంమరెవరికైనావుందా? ఒక లౌకికవ్యక్తికి శుకాధిక్యమూ, అట్టి శుకునికోపమూ సముచితాలేనా? నిజమైన వేదాంతి స్వతోధికుడైన తాత్త్వికునిం జూచి క్రోధం పొందుతాడా విద్యాస్పర్ధియైన పండితునిలా. ఇందులో మరోవిచిత్రం 'పటపటశుకమాని పండ్లు కొఱికె' 'అనుకరణవాచక శబ్దానికి ప్రక్కనే వున్న కర్త పటపటలాడుతున్నాండేమి? పటపటలాడవలసినది పండ్లా శుకుడా? ఇట్టి వచనములు సామాన్యకృతములు కాక విశిష్టస్థానాలంకృతులవైన, మిగిలిన మాబోంట్ల గతి యేమి? దీనిని నైయక్తికముగా గాక తత్త్వదృష్టితో జూడవలెనని మనవి నేటిరచనలు దాదాపిట్లున్నవి కదా! ఏదో ఒకదాన్ని చూపాలి కాబట్టి 'అశ్రుతర్పణం' వదలడం జరిగి ది.

నాకు నచ్చిన కవు లిద్దరే సంస్కృతాంధ్రములలో కలరు వంటి కవులనబడు నేటి కొందరి వాక్యములు పరిహాసజనకములా తత్త్వములా? నచ్చిన కవుల గుణములు, నచ్చనికవుల గుణములు వివరింపవలెకదా! అట్లుకాక కొన్నిమాటలు వదులుటేమి? ఆమాటలు నిశ్చప్రచములేనా? క్షోదక్షమములేనా?

చివర కింతమందికి కీర్తిప్రతిష్ఠల్ని తెచ్చిపెట్టిన 'పద్యం' వారికొంపలుతీసింది. 'ఆంధ్రకవుల అనౌచిత్యాలు' అనేవిమర్శలు శుకానువాదాలు ప్రసారం చేస్తున్నారు అయ్యో! 'పద్యమా!' నీలోని మొదటిఅక్షరం నీవర్గపంచమమైతేయెంత బాగుండును? నీకూ మాకూ బాధే లేదు కదా! పద్యానికీ గద్యానికీ, మరోదానికీ పద్ధతులు తెలియని మామధ్య నీకేది

పథ్యం? పద్యంఅంటే తెలుగుపద్యం, శ్లోకం అంటే సంస్కృతంలోని దని చెప్పేవాళ్ళల మేము ఈ విధంగా చెప్పడానికి 'పద్యం' కూడా రావడం ఛీ వెధవపద్యం కుదిరి చావడంలేదు అనుకునే మేము కవులమా మహాకవులమా అభినవకవులమా? నేను చాలకష్టపడి వ్రాశా నీ మహాకావ్యాన్ని అని చెప్పుకుంటూ మే. పద్యానికి వచ్చే యీ చిత్రహింసకి అంతులేదా?

అనుకరణ కాదా చౌర్యం యింకేదైనా 'కవిని' నాశనం చేస్తాయి కాబట్టి నేటికవులూ, మహాకవులూ, సహృదయులూ, వగైరా మహానుభావులు, కేవలం పద్యంయొక్క శ్రేయోభిలాషులై దాన్ని గురించి ఆలోచించి మార్గాన్ని కర్తవ్యాన్ని నిర్దేశిస్తే చాలా బాగుంటుందేమో? లేకపోతే పద్యం శిష్టకీర్తి, కీర్తిశేషమూ, అవుతుందో భ్రష్టకీర్తి, కీర్తిభ్రష్టమూ అవుతుందో? శిష్టులైన వ్యక్తులు దీనివిషయమై ఆలోచించాలి. మనకెందుకులే బాగుండదు. 'వచనే కా దరిద్రతా' వగైరాలని వదలాలి. అలా కాకపోతే తిరుపతి కవుల వెనుకటి కాల పుస్థితిలోనికి పద్యం పోవచ్చును. ఎప్పుడో పోయింది. యింకా యెందుకీ వృథాప్రయాస అంటారా? ఏమో– స్థితస్య గతి శ్చింతనీయా– ఇది మా ఆలోచన. ఇట్టి విధానానికి శిష్టులందరూ సహృదయతతో వాణీవిలాసరిరంసువులై స్వాగతిస్తారని ఆశించడం దోషమూ, అపరాధమూ, కాదుగదా కారాదని మాయాశ ఇది అడియాస కాకుండుగాక సహృదయా వర్ధంతామ్

# 16. నవసమాజ నిర్మాణంలో రచయితల బాధ్యత

— శ్రీ సోమసుందర్



రచయితలూ కవులూ సామాజిక జాగృతికి ప్రధానపాత్ర వహించాలి ఈ సత్యం కొత్తగా కనిపెట్టేదీ కాదు, కొత్తగా ఉద్ఘాటించవలసిందీ కాదు దఫదఫాలుగా మానవజాతిని జడత్వం ఆక్రమిస్తూవుంటుంది. విస్మృతి పైకొంటుంది. అప్పుడు మళ్ళీ పాతసత్యాలనే తిరిగితిరిగి జ్ఞాపకం చేసుకోవలసి ఉంటుంది సామాజిక పరిణామం గాని, సామాజికాభివృద్ధి గాని, సాహిత్యం విస్మృతపథాల సంచరించే సమయాలలో కలగదు. జాతి సంచలనాన్నీ చైతన్యాన్నీ సాహిత్యం ప్రతిబింబిస్తూనే, సమాజహృదయంలో కొత్త కెరటాలు పోటెత్తడానికి ప్రయత్నిస్తుంది ప్రస్తుతం పెట్టుబడిదారీనాగరికత పేట్రేగి, సాహిత్యం అంగడిసరుకుగా మారిన దశలో ఇతరేతర వ్యాపారసరళి ఆకర్షణలన్నీ సాహిత్యానికీ అగింపబడతాయి జనహృదయ చైతన్యంతో గాని, దీప్తితో గాని, జాగృతితో గాని నిమిత్తంలేని విస్మృతసాహిత్యం అపారంగా పెంపొంది పోతుంది సరిగా ఆ అంతర్దశలో తెలుగు సాహిత్యం జీవిస్తోంది కనకనే మళ్ళీ సాంఘిక ప్రయోజనాన్ని గురించి జ్ఞాపకం చేసుకోవలసి వస్తోంది

*

ఆధునిక సాహిత్యానికి ప్రధాన జీవలక్షణం – సామాజిక జాగృతిపట్ల నిర్నిబద్ధమైన బాధ్యత! అంటే లైంగిక జాగృతి ఎంతమాత్రం కాదని స్పష్టమే, స్వాప్నికసంచారం ఎంతమాత్రం కాదనీ వేరె చెప్పుకోనక్కరలేదు విస్పష్టమైన నిర్దేశాలపట్ల సామాజికుల దృష్టిని లగ్నం చేయడానికే సాహిత్యం కృషిసల్పాలి ఆధునిక నాగరీక సమాజం కొత్తవీ పటిష్ఠమైనవీ అగు పునాదులపై పునర్నిర్మింపబడే మార్గాలను అన్వేషించాలి. ఆదిశగా సామాజికుల ఆలోచనాసరళిని సారింపచేయడానికి సాంస్కృతికంగా సాధించవలసిన పరిణామానికి సాహిత్యం ప్రధాన చోదకశక్తి కావాలి

ఇంతటి మహత్తర బాధ్యత తనమీద పెట్టుకోవలసిన సాహిత్యం ఎలా ఉండాలి? సాహిత్యకారులు, రచయితలూ, కవులూ సృజనోత్సవాన్ని హేలగాకాక, పరమబాధ్యతగా పరిగణించాలి

అంటే రచయిత తన కలం ప్రసవించే ప్రతి పదమూ ఒక జీవచైతన్యంతో కదలాడే ప్రాణోత్సవంగా భావించాలి అది లోకస్థుల హృదయతలంలో ఎలాంటి నూతన స్పందనలు కలిగించవలసి ఉందో గుర్తెరగాలి రచయిత సృష్టించే ప్రతి రసభావమూ, ప్రతి హావభావవిశేషమూ, వర్ణితమయ్యే ప్రతి అనుభవమూ, అత్యంత గాఢనైశిత్యంతో పరీక్షించబడాలి అలవోకగాగాని, బాధ్యతారహితంగాగాని, కేవలం ధనార్జనే ప్రధానధ్యేయమనుకొని కాని రచన చేసేవాడు ఆకర్షణీయమైన పేకెంగులలో విషగుళిక లందించే సమాజశత్రువే కాగలుగుతాడనేది సత్యమే!

పాశ్చాత్య దేశాల మహారచయితల దాకా మనం పోనక్కరలేదు భారతీయ పునరుజ్జీవనానికి తమ సర్వస్వాన్నీ ఒడ్డి తపస్సు చేసిన మహారచయితలను జ్ఞాపకం తెచ్చుకున్నా ప్రస్తుతం మనం ఎక్కడున్నామో తేలికగా అర్థంచేసుకోగలం లోకమాన్య బాలగంగాధర తిలక్కుగాని, విశ్వకవి రవీంద్రనాథ్ టాగూరుగాని, యుగకర్త కందుకూరి వీరేశలింగంగాని, గురజాడ అప్పారావుగాని ఉన్నవ లక్ష్మీనారాయణగాని, సుబ్రహ్మణ్యభారతి గాని, ప్రేమ్‌చంద్ గాని, జయశంకర

ప్రసాద్ గాని, ఆధునిక కేరళ కవిత్రయంగా కీర్తించబడిన వల్లత్తోల్ నారాయణ మీనన్, ఉల్లూర్, ఆశాన్‌లు గాని - ఇలా ఎందరో మహానుభావులు- అందరూ సామాజిక జాగృతికోసం తపించిపోయిన వారే! సోదర ప్రజానీకంకోసం తెలివిడి తలుపులు తెరచినవారే! సామాజిక సమైక్యమును ఉద్బోధించినవారే!

అలాంటివారి సంప్రదాయంలో పుట్టిన మనం ప్రస్తుతం ఎక్కడున్నాం? ధారాపాత నవలల పోటీ విపణిలో వారకాంతల్లా నిలిచే పుస్తకాలను సృష్టిస్తున్నాం. ఆడమ్మగాళ్ళ పోసికోలు కబుర్ల విస్మరణీయ నవలా సాహిత్యపు మహాసనంలో పడి కునారిల్లిపోతున్నాం. భౌతికోపాల ఈషణత్రయంలో పడి కొట్టుమిట్టాడుతున్నాం. మన తీరని కోరికలను నవలా పాత్రలద్వారా తీర్చుకుంటున్నాం అంతే కదా!

లోకమాన్య బాలగంగాధర తిలక్ గారు రచయితలతో మాట్లాడుతూ ఇలా అన్నారుట. 'మన మెందుకింత కష్టపడి రాస్తున్నామంటే-మనలో ప్రజ్వలిస్తున్న ఆత్మశక్తి మనపాఠకులలో ప్రవేశించాలనే! మనలో కలవర పెడుతున్న ఆలోచనలు మన పాఠకుల హృదయంలో చేరి కొత్త కెరటాలను ఉత్తుంగం చేయాలన్నదే మనతపస్సు! మనమానసిక ప్రేరణలు మన జాతి హృదయంలో చైతన్య కాంతులు విరజిమ్మాలనే! అదే మన ఆరాటం, ఆ కాంక్ష!' అంటూ ఉద్ఘోషించారు అలాంటి తీవ్రాభినివేశం మనలో ఎంత మంది కుంది? సమాజం ఎలాపోతేనేం - మనరచనలు డబ్బుతెచ్చిపెట్టడంద్వారా- 'నాచిన్ని పొట్టకు శ్రీరామరక్ష!' గా బ్రతికిపోతే చాలదా-అన్నదే మనధ్యేయంగా మారిపోయింది!

"నేను నావిశ్వాసాలకనుగుణంగా జీవించదలచానంటే- కోపంతోనో ఈర్ష్యతోనో నేరచనా చేయకూడదనే భావిస్తాను. నాసోమరిగడియల కాలక్షేపానికి కూడా నేను రాయడం లేదు. నా పాఠకులలో కామక్రోధాది దుశ్చింతలను ప్రేరేచడానికి నే నసలే రాయను ప్రతివారం నేనీ పుటలలో రాసే వ్యాసాలకు ఉపయోగించే భాష విషయంలో గాని, భావాల విషయంలోగాని ఎంత సంయమం వహిస్తూ ఉంటానో బహుశః నా పాఠకులకు తెలియక పోవచ్చు! ఈసంయమమే నాదృష్టికి నైశిత్యం అలవర్చుతుంది నా లోపలికి నేను గాఢంగా వీక్షించుకోగల శక్తిని కలిగిస్తుంది నాబలహీనతలను నేను కనుగొని ఆవిష్కరించుకోగల చిత్తస్థయిర్యాన్ని పెంపొందిస్తుంది. అప్పుడప్పుడు ఆడంబరంగా నాలో మందే కోపాన్ని బయటపెట్టాలన్న కోరికా కలుగుతూ ఉంటుంది కఠోరపదాలను వాడాలన్న ప్రేరణా కలుగుతూ ఉంటుంది. అయినా సున్నితమైన పదజాలాన్ని ఎన్నుకోవడంకోసం చేసే నాకృషి చివరికి నాకానందం కలిగిస్తూ ఉంటుంది." అంటూ మహాత్మాగాంధీ తన యంగ్ ఇండియా పత్రికలో ఒకమారు రాశారు!

భారతజాతికి పితృసమానులైన ఈ మహనీయుల వాక్యాలను నేనిక్కడ ఎందుకు ఉల్లేఖిస్తున్నానంటే - వర్తమాన సాహిత్య హృదయంలో పేట్రేగుతున్న బాధ్యతారాహిత్యాన్ని గుర్తుచేయడానికే! విస్మరణీయ సాహిత్యాన్ని సృష్టిస్తూ- నేడు తళతళలాడుతున్న వారంతా తమతోపాటే తమ తళతళ లన్నిటినీ శ్మశాన భస్మంగా మార్చగలరే తప్ప శాశ్వతకాంతులు వెలార్చలేరని తెల్పడానికే!

ప్రస్తుతం సాహిత్యరంగంలోనికి తలలెత్తుతున్న యువరచయితలు తమచుట్టూ తళతళ మెరిసే ఈ కాకిబంగారు తళుకులకు మోజుపడకుండా, సాహిత్యానికిగల పరమప్రయోజనంపట్ల మనసులు లగ్నం చేసి, వారినైనా బాధ్యతాయుత సాహిత్య సృజనకు ఆయత్తంచేయాలనే! మేధాపరంగా బలహీనులైన సామాజికుల బలహీనతల నాసరాగా గొని తమపబ్బం గడుపుకో జూస్తున్న దుర్మార్గ బోధముల నుంచి యువసాహితీపరుల దృష్టిని మళ్లించడం అవసరమనే!

ఈ ప్రయోజనం సాధించాలంటే రచయితలకే ఒక తాత్త్వికఅవగాహన అందించాలి నిర్దిష్టలక్ష్యాలను బోధించాలి. కాకపోతే తేలికపాటి ఆకర్షణలకు సహజంగా యువహృదయం ఆకృష్టమై ప్రస్తుత తరం సృష్టిస్తున్న విషవాగురలలోనే గుడిసుళ్ళు పడుతుంది.

రెండు దశాబ్దాల లోపుగానే మనలనందరినీ ఇరవై ఒకటో శతాబ్దం ఆలింగనం చేసుకోబోతోంది. ఆనవయుగ పరీరంభానికి మనం త్రిశుద్ధిగా సంసిద్ధులమై ఉన్నామా? లేదా? అన్న విచికిత్స ప్రతి ఆలోచనాపరుడికీ కలగవలసిన శుభతరుణం ఆసన్నమై ఉంది మన ఆలోచనలు సమకాలికమైనవే అయినా, మన అవసరాలు వర్తమానానికి చెందినవే అయినా,

మన అవసరాలు వర్తమానానికి చెందినవే అయినా, మన గాథానుబంధాలు మళ్ళీ తిరిగించి గతశతాబ్దాల చరిత్రలకు, సంప్రదాయాలకు, సిద్ధాంతాలకు, జీవనవిధానాలకు విడతీయరాని బ్రహ్మముడి పడివుంటే మనం ఆగామి శతాబ్దపు నూతనోత్సవానికి అర్హులం కాగలమా? అని ప్రతి ఒక్కరయూ ప్రశ్నించుకోవలసిన సమయం ఆసన్నమైంది ప్రశ్నించుకోవడమంటే అది భౌతికతలంలో సాగవలసిందేకాదు అంతర్ముఖులమై మనలో లోతులను సంశోధించుకోవలసి ఉంది.

చరమదశాబ్దాలతో తొందరపడుతున్న ఈ శతాబ్దంలో కన్నులెత్తిన సాహితీపరుల బాధ్యత ఏమిటి? సామాజిక ప్రయోజనం నిర్దేశితగమ్యంగా స్వీకరిస్తూనే భావితరాలకోసం మార్గదర్శకమైన సాహిత్యాన్ని సృష్టించవలసిన బాధ్యత మనందరిపైనీ ఉంది దీనినే మరింత స్పష్టంగా చెప్పుకోవాలంటే గుణసాంద్రమైన సాహిత్యాన్ని మనం సృజించుకోవలసి ఉంది తరతరాలుగా మానవజాతి సాధించిన సకలకళామయ వారసత్వాలనూ మనం పెంపొందింపచేసి, ఆగామి తరాలకు అందించవలసి ఉంది. తద్వారానే మనం సాంప్రదాయిక సనాతనధర్మాల విషముష్టులనుంచి సాహిత్యారామాన్ని రక్షించగలుగుతాం ఆగామికి స్వచ్ఛ శీతల జలసేచన మందించగలుగుతాం అయితే గుణసాంద్రమూ, కళామయ వారసత్వ సంపన్నమయమూ అగు సాహిత్యాన్ని యుక్తతరం సృజించాలంటే మన ప్రాచీన సాహిత్యంలోగల జీవరేఖలను ఆకళింపు చేసుకోవాలి. అనూనసంపదగా పెంపొందుతూ వచ్చిన మడికారపు సొంపులను స్వాధీనపరచుకోవాలి. తరతరాలుగా భారతీయమనీష సాధించిన విజయాలేవో, అపజయాలేవో గుర్తించుకోవాలి. సంప్రదాయంపట్ల మూఢవిశ్వాసం మన జాతి కింతవరకూ ఏమీ మేలుచేయలేదు. కనుకనే జాతి కాపాడుకుంటూవచ్చిన వారసత్వం ఏదో గుర్తించుకోవలసిన తరుణం ఆసన్నమైంది సంప్రదాయమూ వారసత్వమూ పర్యాయపదాలుకావు సాహిత్యపరంగా అసలేకావు సంప్రదాయం ఆచారనిబద్ధమైనది అది నిన్నటివరకే దృష్టిని సారించగలదు తప్ప యుగయుగాలుగా అనుస్యూతంగా పరిఢవిల్లుతూన్న జీవప్రవంతిని పోల్చుకోలేదు వారసత్వం అలాంటిది కాదు దానికి భౌతిక ఆచారాలతోను, కట్టుబాట్లతోను నిబద్ధత ఉండదు ఆంతరిక జీవనధాతువులను మాత్రమే పరిరక్షించుకుంటుంది. తల్లితండ్రులనుంచి స్వీకరించిన అణురూపమైన జీవశక్తిని రక్తనిష్ఠం చేసుకుని పెరిగిన ప్రతి కుమారుని వలెనూ వారసత్వం మన భావనామయలోకాన్ని పరిపుష్టం చేస్తుంది

దానిని గుర్తించినపుడే మన వారసత్వంగా నిలిచిన నాగరికత యేదో, కళాధర్మమేదో, ఆత్మపదార్థంగా విలసిల్లవలసిన చైతన్యమేదో, వర్తమాన సమాజంపట్ల రచయితకుగల బాధ్యత ఎట్టిదో నిర్దిష్టంగా మన హృదయాలలో ఆవిష్కరించగలుగుతుంది ఆపరిపూర్ణ ఆవిష్కారరూపమే మనం సృష్టించే సాహిత్యానికి జీవత్కళలను సంతరింపచేస్తుంది రాజకీయ, ఆర్థిక, సామాజిక, మేధాపరరంగాలలో మార్పు పొందవలసిన విలువలేమిటో గుర్తించగలుగుతుంది వర్తమాన సామాజికుని సకలక్రియాసిద్ధులకూ మన సాహిత్యం రసధాతువు లందించి తరింపచేయగలుగుతుంది

## 17. బ్రాహ్మీనవరత్నమాల

– శ్రీ శనగన నరసింహస్వామి



* అమ్మ! భారతి! నీ చరణాబ్జరజము
ఎన్ని జన్మల తలపై ధరించినానో
మెచ్చి ఈభవమందు నా కిచ్చినావు
బాల్యమునయందె కవితా విపంచి నీవు
* మేదుర దయాసుధారస స్వాదుదృష్టి
నీవు నాచేత నిడిన మాణిక్యవీణ
శక్తికొలదిని పలికింప సాధనంబు
సలుపగా బూని ముప్పదినుమలు చెల్లె.
* అపుడపుడు నీవువత్స! నాయంతికమున
గాన మొనరింపు మనుచు నాహ్వానలేఖ
పంపితివిగాని శ్రుతి అపభ్రష్ట మగునో
లయ లగింపదో యనుచు తల్లడము పడితి.
* నారదాది మునీంద్రుల నవ్య దివ్య
గాన పీయూష అవారుల స్నానమాడు
తావకీన సభావాటి తగుదు నంచు
సిగ్గు విడనాడి యిటు ప్రవేశింతు దేవి!
* వ్యాస వల్మీకభవ కాళిదాస భాస
శబ్దశాసన కుండలీట్ శంభుదాస
పెద్దనాది కవీశులు బిరుదు కెక్క
నీ కొలువునందు నే నెట్లు నిలువ వేర్తు'
* ఈడువారును జోడువా రింతొ అంతొ
మెచ్చగా కావ్యవీణను మీటుకొందు
ఎట్లొ నా నేర్చినట్లు రేయింబవళ్ళు
తల్లి! వాగ్దేవి! కురియుమ మాత్స్నేహవృష్టి
* పూర్వ కవిచంద్రములశబ్దపుష్టి కొంత
నవ్య కవిసత్తముల భావనంబు సుంత
నాడు నాటికి జిహ్వాగ్రపై నాట జేసి
క్రొత్తపాటలు పాడించుకొనుము జనని!
* కచ్ఛపీ వల్లకీ తంత్రికలను దాటి
తేలివచ్చిన స్వచ్ఛగీతీ రవాలు
కొన్ని నారత్నవీణలో కొలువుసేసి
పలుకుగాక! పుస్తకపాణి! బ్రహ్మరాణి!
* సౌధముల గోర నాక కర్ణకాల చాలు
గముల నోల్ల నుదరసంపూర్తి చాలు
ప్రతి నిమేషము నీ పాద పద్మపూజ
గాలు చదువులసాని! షట్చరణవేణి! *



## 18. ఆశాసనము

విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు,
ఎం. ఏ.



* సూచన లెన్నొ చేయుచును
సుందర సత్కవితా విమర్శ సం
కోచము లేని పద్ధతిని
గొప్ప విశేషములన్ వచించుచున్
వాచవి మీఱ సత్కృతుల
భవ్య విమర్శకతంబునన్ సమా
లోచన నిత్యనూతనత
లోకమునం దలరారుc గావుతన్!
మూడు సంవత్సరంబులు ముద్దులొలుకc
గడపి పుట్టినదినమునc గని మహోత్స
వములc బెద్దలవలనను నిమిషనిమిష
మును సమాలోచన యశమ్ముగనును గాక!

* నవరసాలంకార కవితా మహోకళా
నిలయమ్మ వగుమమ్మ! నిస్తులముగ
ఏదోషమును లేని హితమిత మ్మగు సద్వి
మర్శల గృహమ్మవై మనcగదమ్మ!
నిరుపమ సత్కథా నిచయంబునకు మంచి
వ్యాసంబులకుc బేరువడయు మమ్మ!
నిష్పక్షపాత వినిర్మల సమభావ
బహుళతకున్ ఖ్యాతిc బడయుమమ్మ!
భారతీసేవ గావించి బహువిధముల
గను మితోధిక విఖ్యాతి క్షణము క్షణము
ఘన 'సమాలోచనా' పత్రికాకుమారి!
వఱలు దీర్ఘాయురారోగ్య భాగ్యవితతి.

* నియమఘన సంపదభివృద్ధి నీతి రీతి
పావనోదాత్త భావ సంవ్యాప్తి యభిమ
తాప్తి కల్గంగ నీcక నీcక నలరుమమ్మ!
ఘన 'సమాలోచనా' పత్రికా కుమారి!

* సమ్యగాలోచనంబున సముచితగతి
సర్వసమభావ దివ్యలోచనములc గని
సార్థకము నామధేయమ్ము సకలగతులc
గా సమాలోచనా! మనcగాc గదమ్మ!



# 19. ఈ పక్షంలో

## (1) అష్టావధానం

భాగ్యనగరంలో దేవీశరన్నవరాత్రోత్సవ సందర్భముగా శ్రీ విద్యా సమితి ప్రోత్సాహంతో ఎబిసిడి అగ్రసైజేషన్ వారి ఆధ్వర్యవంలో 'తిరుపతి వేంకటకవుల స్మారక అష్టావధాన సభ' ఏర్పాటైంది మొదటి కార్యక్రమం చిక్కడపల్లిలోని సత్యనారాయణస్వామి ఆలయంలో జరిగింది ప్రారంభోపన్యాసం శ్రీ దివాకర్ల వెంకటావధానిగారొసంగిరి శ్రీ ఎమ్ వి. సుబ్బారావుగారు అధ్యక్షత వహించిరి

అవధానము శ్రీ నూరం శ్రీనివాసులు గారు, పొన్నూరువాస్తవ్యులు సభారంజకముగా నొనర్చిరి. వివరాలు పృచ్ఛకుల నామధేయాలతో సహా క్రింద పొందు పరుపcబడినవి.

సమస్య రాముం డంగభవార్తినొంచె
నకటా

రామాంతరాసక్తుడై-శ్రీ రాజన్నశాస్త్రి
కామక్రోధమదాది శత్రుగణ సం
క్రాంతాత్ముడై దర్పకో
ద్దామ ప్రాభవమున్ సహింపక అదే
తత్త్వంబుగా నెంచుచున్
క్షేమంబైనను లెక్కసేయక దశ
గ్రీవుండు దీవ్యద్వ్యథో
రాముం డంగ భవార్తినొంచె నకటా
రామాంతరాసక్తుడై.

దత్తపది కొండ, రండ, దండ,
కండ - భారతార్థం - శ్రీ విశ్వనాథం

కొండల పిండిచేయుటకు
కూడ సమర్థత గల్గియుండి రా
రండని పిల్వగా ననికి
రా నని పల్కుటదేమిపాడి కో
దండము చేతగొమ్ము సుర
తండము నీకయి చూచుచుండె నీ
కండబలమ్ము చూపగను
కాలము వాసవనందనా! సఖా

వ్యస్తాక్షరి దైవతం మానుషాకారం
నమ స్మరు దనోకహం - శ్రీ రాజమౌళి

వర్ణన నేటి కిరసిన్ కొరత గురించి
శార్దూలం - శ్రీ తిరుమల రామచంద్ర

మంటల్ మండెడివేళలో బ్రతుకు సా
మాన్యంబుగా నెంచి ఆ
మంటల్ దీర్పగ పాడియంచు కిరసన్
మార్కెట్టులో నుంచమిన్
మంటల్ రేగ జనాళిలో కటకటా
మంచేమొ చెట్టేమొ ఏ
మంటన్ జెల్లదు కాలమొక్కటియె త
న్మాత్రమ్ము సాధింపగన్.

నిషిద్ధాక్షరి : రమాసహితుడైన సత్య
నారాయణుని గూర్చికందం-శ్రీఉప్పల
మనలో మదిలో నెన్నో
ధనకాంక్షల్ గల్గనేల? తద్భాగ్యంగ
గొని మాకల్పనతోడన్ [లిన్
జను నాసృతసాత్తుగొల్వ జతురిమ
యుండన్

అవధానంలో అప్రస్తుత ప్రశంస హర్షధ్వానాలతో -

అవధానిగారి సమయస్ఫూర్తివలన హృదయరంజకంగా శ్రీ నీలా జంగయ్యగారి సహకారంతో - జరిగింది. ఉదాహరణకు రెండుమూడు ప్రశ్నలు.

శ్రీనీలా. ఉప్పు ధర పెంచే ప్రభుత్వం ఎప్పుడొస్తుంది ?

అవధాని : సముద్రజలమును తియ్యగా మార్చే ప్రభుత్వం వచ్చినప్పుడు

శ్రీనీలా పప్పులో కాలు ఏరకంగా ఆను కోవాలి?

అవధాని : నేను పప్పు అనుకుంటే మీరు కాలువేసినట్టు మీరే పప్పైతే మీవి పప్పులో కాలు.

శ్రీనీలా మీరు పెదవులతడుపుతున్నారు
పాదం అనుకుంటూ ఎన్ని పాదా
లున్నాయండి మీనోట్లో?

అవధాని మీఅందరికీ చతుష్పాత్తులను
చెయ్యవలసిన బాధ్యత నా కుంది
కనక, అందు కవసరమైనన్ని.

ఈవిధంగా మనోరంజకంగా సాగింది ఆసాంతం, సభ్యులవార్షధ్వానాలు స్మిత, వర, అట్టహాసాల నడుమ అప్రస్తుత ప్రశంస

ఛందస్సంభావణ భారాన్ని వహించిన ఆచార్యవర్యులు దివాకర్ల వేంకటావధానిగారిని సదస్యులను అవధానిగారు సంతృప్తిపరచారను కోవటానికి ఉదాహరణముగా

శ్రీ దివాకర్ల దండలు మెడలో వేయక
దండన బెట్టిరి ఇదేమిధర్మమొచెప్పుడీ

అవధాని దండను గొన జాలినవా
రుండినచో గొనుడు మారు ఊహాలి
కేలా? మరియు

దివా తిరుపతి వేంకటేశ
ధీవరుల పోలిక మీరు మీసములు
పరువముతో పెంచిరి
భావము తెల్పెదరా కవివరా!

అవ తిరముగ రెండు మీసలను దీర్చితి
కాని కవిత్వశక్తి కా
వరమున కాదు మీసమత వచ్చుట
కష్ట మటంచు సత్కవీ!

పద్యాలను చెప్పవచ్చు. (ఆచార్యులకు మీసములు లేవు)

అవధానం మొత్తం శ్రోతల చిత్తాల నలరించిం దనటంలో అతిశయోక్తి లేదు. ఘంటానినాదాన్ని సమయస్ఫూర్తితో శ్రీ ఎస్ ఎస్ సుబ్రహ్మణ్యంగారందించారు ఈవిధంగా వెలకొక్కసారేనా అవధానా లేర్పాటు చేయగలమని శ్రీ పురుషోత్తంగారు ఆకాంక్షని, ఆశాభావాన్ని ప్రకటించారు.

— కె. ఎస్. ఆర్.

## 2) శ్రీ వేంకటేశ్వర సాహిత్య సభలు

అధ్యాత్మ రామాయణం, వాల్మీకి రామాయణం మహాభారతం, దేవీభాగవతం, విష్ణుభాగవతం, శ్రీవేంకటేశ్వర విజయం, మహర్షుల చరిత్రలు మొదలైన శతాధికగ్రంథాల కృతికర్తలు, శ్రీఅన్నవరం సత్యవతీ దేవీస్త్రీల ప్రభుత్వకళాశాలలో ఆంగ్లభాషాచార్యులు, ఆర్షకవి శిరోమణులు విద్వాన్ ఖులుసు వేంకటేశ్వరులు ఎం.ఏ.64వ జన్మదినోత్సవసాహిత్య సభలు అక్టోబరులో ఇటీవల కాకినాడ దివ్యజ్ఞానసమాజం (గౌతమలాడ్జి) లో వైభవోపేతంగా జరిగినవి

తొలిరోజు సభ వేదపండితుల స్వస్తి వాచనములతో, మహాశీర్వచనములతో ప్రారంభమైనది. ఆనాటిసభకు శ్రీ బి రంగయ్యారెడ్డి (P A to the District Collector Addl· Dist· Magistrate) అధ్యక్షత వహించారు తమ అధ్యక్షోపన్యాసంలో శ్రీ రెడ్డి శ్రీవేంకటేశ్వర సాహిత్యసమీక్ష చేస్తూ ఈసాహిత్యమంతా దైవదత్తమైందని, సామాన్యమానవులకి సాధ్యంకానిదని, అంతాకూడ ఆర్షసంప్రదాయ యుక్తం ఆధ్యాత్మికం అవడం చాలా హర్షదాయక మనీ శ్లాఘించారు శ్రీ వెలమకన్ని సుబ్రహ్మణ్యశర్మ (ప్రముఖ న్యాయవాది) శ్రీ వేంకటేశ్వరసాహిత్యం సుప్రసన్నం, సుందరం, సులభద్యోతకం అనీ శ్రీ వేంకటేశ్వరుల ప్రవర్తనవలెనే కవిత్వంకూడా విద్యావినయశౌచసంపన్న మనీ ప్రశంసించారు శ్రీ కుమ్మలూరి సత్యనారాయణ శ్రీ వేంకటేశ్వరులను అభినందిస్తూ 'వారు నూటపదాలు గ్రంథాలతోపాటుగా నూటపదామేళ్లు జీవించి ఇంకా లోకోపకార మహాగ్రంథాలు వ్రాయాలని ఆకాంక్షించారు శ్రీమతి బి. సావిత్రి మాట్లాడుతూ 'మహాభారతం వ్రాయడానికి కవిత్రయానికి కొన్ని శతాబ్దాలు పట్టడం, ఆరుగురు పూనుకొని పూర్తి వాల్మీకం కాని భాస్కర రామాయణం కొన్ని దశాబ్దాలకు మన కందివ్వడం జరగింది' అన్నారు 'మహాభాగవతం పోతన్నగారిజాతకం బాగుండి ఆయనకి పేరు తెచ్చిందే కాని, భాగవతం రాసిన ఆరుగురిలో ఆయన ఒకరనీ, మూలభిన్నాలెన్నో అందులో ఉన్నా' యనీ అనిరి.' అలా కాక ఒక్కచేతిమీదుగా ఒకటి, ఒకటిన్నర దశాబ్దాల్లో ఆపై మూడు మహాగ్రంథాలేకాక శతాధిక గ్రంథాల్ని మనకు సమర్పించిన మహాకవి శ్రీవేంకటేశ్వరులని శ్రీ వేంకటేశ్వర సాహిత్యమును శతధా శ్లాఘించారు. భారతీయవిద్యాభవనం స్థానిక కార్యదర్శి శ్రీ నేమాని వేంకటరావు వ్యక్తిగా కవిగా భక్తుడుగా శ్రీ వేంకటేశ్వరులతో పరిచయాల్ని తన అనుభవాల్ని విశదీకరించారు

శ్రీ వేంకటేశ్వరులు తగినరీతిని కృతజ్ఞత చెప్పి శ్రీదేవీపూజ, భువనేశ్వరీశతకం కవితాగానం చేశారు.

రెండోరోజు సాహిత్యసభకు శ్రీరాయప్రోలు ఆంజనేయశర్మ I.R S· Income Tax Officer అధ్యక్షత వహించి శ్రీ వేంకటేశ్వర సాహిత్య ప్రశంస చేశారు డా॥ నండూల గోపాలకృష్ణమూర్తి ఎం ఏ, పి హెచ్ డి 'కవిత్రయ భారతం శ్రీ వేంకటేశ్వరభారతం' గూర్చి మాటాడుతూ తులనాత్మక పరిశీలనచేసి శ్రీ వేంకటేశ్వర మహాభారతం చిరస్థాయి కాగల దన్నారు సులభశైలి, నూటిపలుకులు, సుందరభావాలు వీరి గ్రంథాలలోని సుగుణాలని విశదీకరించారు శ్రీ రాళ్ళబండి సత్యనారాయణ శాస్త్రి మాట్లాడుతూ శ్రీ వేంకటేశ్వర విరచిత రామాయణ భారతభాగవతాలు, శ్రీ వేంకటేశ్వరవిజయం నిత్యం శ్రీత్రిపుర

సుందరిగుళ్లో పురాణప్రవచన చేశాననీ అటు చదివేవారికి ఇటు వినేవారికి ఉభయులకీ శ్రావ్యంగా, సుఖంగా సులభార్థ ద్యోతకంగా అవి ఉన్నా యనీ ప్రశంసించారు.

శ్రీ వేంకటేశ్వరులు స్వీయ దేవీభాగవత ఘట్టాల్ని కావ్యగానంచేసి సభ్యులకు తన్మయత్వం కలిగించారు.

మూడోనాడు జరిగిన సాహిత్యసభ వ డా॥ కె రామచంద్రరావు శ్రీ వేంకటేశ్వర విజయంలో 'శ్రీ వేంకటేశ్వరుల అక్షరరమ్యత' అనే విషయాన్ని గూర్చి సోదాహరణంగా ప్రసంగించారు.

తరువాత శ్రీ పరవస్తు గోవిందాచార్యులు 'వ్యాస భాగవతం – వేంకటేశ్వర భాగవతం' అనే విషయంపై మాటాడుతూ మూలభాగవతం మహాప్రౌఢ క్లిష్ట జ్ఞానవిషయాలకి నిలయ మనీ అది అర్థం చేసుకోగల్గడమే చాలాకష్టం అనీ సరిగా అర్థం చేసుకుని ఇతరులకు సులభంగా చెప్పడం మరీకష్టమనీ, ఈ మహాకార్యంలో శ్రీ వేంకటేశ్వరులు చాలామట్టుకి కృతకృత్యులయ్యే రనీ సోదాహరణంగా ప్రసంగించారు.

కుమారి యమ్. గౌరి, కుమారి బి సత్యజ్ఞానేశ్వరి (పెద్దాపురం మహారాణి కళాశాలలో ఉపన్యాసకురాండ్రు) తమ గురువరుల కవితా మాహాత్మ్యానికి నీరాజనం పట్టారు శ్రీవత్సవాయి అంబరీష వర్మ (మహారాణి కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు) కూడ శ్రీ వేంకటేశ్వరులు తమ గురువు లని తత్కవితా విశేషాన్ని ప్రస్తుతించారు.

గుంటూరు ఏ సి కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు శ్రీ టి భాస్కరరావు (స్ఫూర్తిశ్రీ) ప్రసంగిస్తూ 'శ్రీ వేంకటేశ్వరు లెంత రమణీయంగా పద్యం నడపగలరో అంతరమణీయంగా గద్యంకూడా నడపగల సమర్థు లని వారి 'మహర్షుల చరిత్రలు' మున్నగు వచన గ్రంథాలు అందుకు నిదర్శనాలనీ ఇంతవరకు మహాపురాణాలు నిర్వచనంగా ఆంధ్రీకరించి అద్భుతప్రజ్ఞ చూపేరు గనుక ఇకకొన్ని మహాగ్రంథాలు వచనంలో వ్రాయా లని అర్థించారు.

సభ్యుల ప్రార్థనపై శ్రీ వేంకటేశ్వరులు శ్రీ వాల్మీకి రామాయణానువాదమైన స్వీయ సుందరకాండను గురించి మాట్లాడుతూ సుందరకాండ నామౌచిత్యం సరిగా ఎవరూతృప్తికంగా చెప్పలేదని ఇలా వివరించారు. 'కథ సుందరం, కవిత్వం సుందరం కనుక సుందరకాండ అని పేరు వచ్చిం దన్న వాదం తృప్తిగా లేదు ఈవిషయం అన్నికాండలకి వర్తిస్తుంది కనుక దీని కొక్కదానికే అందువలన ఈ పేరు వచ్చిందనడం బాగాలేదు

హనుమంతుడికి సుందరు డని పేరుంది కనుక ఈకాండకి సుందరకాండ అని పేరు వచ్చిందన్నారు కొందరు అదీ బాగాలేదు హనుమంతుడికి సుందరుడన్న పేరు ప్రసిద్ధంగా ఎక్కడా లేదు ఒకవేళ హనుమంతుడి పేరు సుందరుడైనా అతనికోకాండ చెప్పినవాల్మీకి అతనికంటె ఎక్కువైన సీతకు, లక్ష్మణునికి, భరతుడికి కాండలు కేటాయించలేదే ?'

ఈవిధంగా సుందరకాండ నామౌచిత్యానికి పూర్వులు చెప్పినయుక్తు లన్నీ ఖండించి సుందర మనగా లంకాపట్టణ మనీ మూడులోకాలు జయించి రావణుడు తెచ్చిన రత్నమాణిక్యాలతోటి వజ్ర వైడూర్యాలతోటి వెండి బంగారాలతోటి లంకని మహాసుందరనగరం చేశాడని,సుందరమంటే లంక అని వైజయంతీ నిఘంటువు పేర్కొందనీ, అదికాక,రామాయణంలో ముఖ్య పట్టణాలు మూడని, అవి అయోధ్య, కిష్కింధ, లంక అనీ, మొదటి రెండింటికి రెండుకాండలు కేటాయించిన వాల్మీకి మూడవదైన లంకకే ఈకాండ ఏర్పాటుచేశాడని యుక్తియుక్తంగా సుందరకాండ అంటేలంకాకాండ అని నిరూపించేరు. తులసీదాసు కూడా లంకాకాండ అన్నాడేకాని సుందరకాండ అనలే దనీ, ఇప్పటికీ లంకను శ్రీలంక అంటారనీ అంటే సుందరలంక అని అర్థమని, లంక విశ్వకర్మ నిర్మితమనీ,దాని భౌగోళికస్థితికూడా చాల సుందరమనీ, వివరించారు. సభ్యులేకగ్రీవంగా సంతోషించి అంగీకరించారు.

శ్రీ వక్కలంక రామలింగస్వామి, డా॥ కె. రామచంద్రరావుగార్లు నూతన వస్త్రయుగళాలతో శ్రీవేంకటేశ్వరులను సత్కరించారు శ్రీమతి కస్తూరి స్వరాజ్యలక్ష్మి, శ్రీ బి. సోమయాజులు శ్రీ సి రంగనాయకులు తలొక నూటపదార్లు ఇచ్చి శ్రీ వేంకటేశ్వరులును సమ్మానించారు.

మూడురోజుల సాహిత్యసభలలోనూ ప్రార్థనచేసిన మనోజ్ఞ గాయని కుమారి సాలగ్రామ బాలాత్రిపురసుందరి బి.ఏ., ని కృతజ్ఞతావందనాలు తెలిపిన శ్రీవేంకటరావుని అందరూ ప్రశంసించారు.

—+—

## 20. శ్రీనాథుడు

– శ్రీ ఎ. రామసూర్యనారాయణ.

* చిఱుతప్రాయము నాడె సర్వకవితా
  సింహాసనారూఢుడై
పరులన్ రాజసభాప్రదేశముల స్వ
  ప్రజ్ఞావిశేషంబునన్
కలమాశ్చర్యము గా జయించి బహు స
  త్కావ్యంబులన్ వ్రాసి సు
స్థిరకీర్తిన్ గొను మారయాత్మజుని భ
  క్తిన్ నే ప్రశంసించెదన్.

* తనపూర్వుల్ విరచించినట్టివగు స
  త్కావ్యంబు లెల్లన్ పఠిం
చిన తర్వాత విశిష్టరీతిని రచిం
  చెన్ నైషధంబంత సిం
గన మంత్రీశ్వరు ప్రార్థనంబున కవల్
  గంభీర వాగ్గుంఫన
ధ్వని శయ్యారభటీ సమాస ఘటనా
  ధారా సమేతంబుగన్.

* అల చిఱుతొండ నంబికథ
  యందు కిరీటి తపస్సు చేయు గా
థల తన ఈశ్వరార్చన వి
  ధంబు సమస్తము ప్రస్ఫుటంబుగా
తెలియ రచించె మార్దవ గ
  తి స్థితసూక్తి విశేష భావనా
లలిత ప్రబంధమా హరవి
  లాస కృతిన్ సరసోచితంబుగన్.

* శ్రీవిశ్వేశు కృపన్, మహత్త్వమును, కా
  శీఖండ కావ్యంబునన్
ప్రావీణ్యంబున తెల్పుచున్ వివిధ శా
  స్త్ర గ్రంథ సందర్భముల్
భావంబుల్ రసముల్ సమాస ఘటనల్
  వాక్చిత్రణల్ వర్ణనల్
కావించెన్ ప్రతిభావిశేష కలనన్
  కావ్యోచిత ప్రక్రియన్.

## 21. గ్రంథ సమాలోచన

### 1) శ్రీరామరాజ్యము

[ కవి శ్రీ చెఱకుపల్లి జమదగ్నిశర్మగారు వెల 10 రూ. ప్రాప్తిస్థానము శ్రీ చెఱకుపల్లి జమదగ్నిశర్మగారు. శ్రీరామనగరం కాలనీ, పానగల్లు, శ్రీకాళహస్తి. చిత్తూరు జిల్లా ]

శ్రీ మద్రామకథా దివ్యత్వము నందించిన తపశ్శీలుడగు వాల్మీకి భగీరథునివంటివాడు. ఆ దివ్య తరంగిణిలో మునకలాడి తృప్తినందక భావనావైవశ్యములో నవ్యత్వ మూహించిన భవభూతి ప్రభృతులు కల్యాకర్తలు. అట్టి పారవశ్యమును గలిగించుశక్తి రామాయణమునకు సహజము. కావ్యప్రయోజనము లన్నిటిని సిద్ధింపజేయు రామాయణ మహాశిలాశకలము భవభూతివంటి మహాశిల్పులచేత బడి మనోహరరూపమున చిరస్థాయిత నంది వాఙ్మయ మహాకాశమున ధ్రువనక్షత్ర మైనది. అట్టి రామాయణ వియద్గంగను కల్పవృక్షముగ భావించినవారనేకులు. ఉత్తరకాండను వాల్మీకి రచింపలే దనికొందరు, అతడే రచించెను కాని పారాయణాదులయందు నిషిద్ధ మని మరికొందరు తలతురు శ్రీరామపట్టాభిషేకానంతర వృత్త మందు వర్ణితము. కరుణరస ప్రాధాన్యము సుస్పష్టము గుటవలన దైవములుగా మానితులగు సీతారాముల విషాదాంతము పాఠకులకు బాధకలిగించుట సహజము. భావుకమహత్తరు డగు భవభూతి మహాకవి దీనిని తనయనల్పకల్పనా విభూతిచే నుత్తరరామచరితముగ దిద్ది సుఖాంతము గావించెను.

అట్టి యుత్తరరామచరితను మనమున నుసంభావితము గావించి శ్రీ చెఱకుపల్లి జమదగ్నిశర్మగారు మరికొన్ని మార్పులతో శ్రీరామ రాజ్యమును రచించిరి. ఇందు ప్రతిజ్ఞాసమజ్ఞాప్రతిష్ఠా ప్రత్యభిజ్ఞా ప్రత్యావయనము లనుఖండము లైదు కలవు వీనికే వరుసగా సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానము లను నామాంతరములను సాభిప్రాయముగా నుంచిరి ఈ యైదును శివుని పంచముఖముల పేర్లు. ఇట్లు వీని నొకచో జేర్చుటవలన శివాద్వైతము స్థిరీకృతము కావలె నని వీరి యభిప్రాయము. అనగా దీనిని రామాయణమున (రామ + అయనము లేదా రామా + అయనము) శివాద్వైతము (శివ + అద్వైతము, శివా + అద్వైతము) సాధించి యప్రతిహతముగ నిలిపి చాటవలె నను వీరిదృష్టి సుస్పష్ట మగును. ఈ కావ్యములోని ఖండపంచకమున కవిస్తుతి కథాభాగము మున్నగునవన్నియు గలిసి 1841 పద్యములు కలవు వీనిలోని యంకెలను పరస్పరము కూడినచో వచ్చు మొత్తము9. సంఖ్యాశాస్త్రమున నవసంఖ్యకు గల పారమ్యము వీరి కిష్ట మని పాఠకులు గమనింపవలసిన విషయము. శ్రీ శర్మగారిపద్యనిర్వహణ, కథాకథనము పాత్రపోషణ శిల్పము మున్నగునవి మనోహరము లనుట స్వభావోక్తియేకాని యతిశయోక్తి గాని యర్థవాదముకాని కాదు. దశాబ్దముల తరబడిగా నాయన వాఙ్మయోపాసనలో కవితాసస్యమును బహుప్రీహిగ నిబ్బడి ముబ్బడిగా దిగుబడి గావించిన హాలికోత్తముడు. శ్రీ జ్ఞానప్రసూనాంబికా కాళహస్తీశ్వరుల యంతేవాసిత్వము విశ్వనాథ

కవితాభావుకత్వ సంపన్నత యొకదాని నొకటి మించి వీరి కవితాసుమనః ప్రౌఢి మకు కారణములైన వనిపించును ఇంత పెద్దగ్రంథము నింతచక్కగా ముద్రించు నట్టి యవకాశము శ్రీ వేంకటేశ్వరస్వామి దయచే కల్గుటయు ప్రశంసనీయము ముద్రారాక్షసములు విరళ విరళము. కావ్యము తనబహిర తస్సౌందర్యములచే పండితపామరుల కానందము నధికముగా కలిగించుటలో సందేహము లేదు.

ఈకావ్యమునందలి ఖండాంత, ఖండాదిమ పద్యములు శివపరములుగా నుండుట వలన నిది పరమశివునకు శ్రీకాళహస్తీశ్వరస్వామికి అంకితమని భావింపవచ్చును గ్రంథాదిలో దేవతాస్తుతి, వాల్మీకివ్యాస శంకరులస్తుతి, గురుస్తుతి, కాళిదాసాది కవిస్తుతి, పిమ్మట కవితాగురు విశ్వనాథ స్తుతి మనోహరములు విశ్వనాథవారు తమ రామాయణ కల్పవృక్షమును సోత్తరముగ వ్రాయుదు మని పట్టాభిషేకము వరకు వ్రాసి, యుత్తరకాండను వ్రాయరేమని యడిగిన శ్రీ శర్మగారితో 'నేనే వ్రాయుట యేల? నాశిష్యులచే వ్రాయింతును నాకు గల నల్గురు శిష్యులలో నీవొకడ వని రట దానిని శ్రీ శర్మగారు భక్తితో నాజ్ఞగా గొని శ్రీకాళహస్తీశ్వర స్వామి కృపాలేశమున నీ మహాకావ్య రూపమున నిర్మించి దానిని తమగురువులకు జూపి వారి యాశీరామోదముల నందిరట. ఇది సామాన్యమైన విషయము కాదు ఇంతటియైన పిమ్మట భవభూతిని, తిక్కనను, పాపరాజును స్తుతించుట సామాన్య పాఠకులకు ప్రక్రమభంగ మనిపించును గాని పరిశీలించినచో శ్రీశర్మగారు తమ కావ్య వస్తునిర్వహణమున నీ ముగ్గురను వారి సంపత్తిని యథోచితముగ నుపయోగించికొనిరని స్పష్టమై ఉచితమే అనిపించును. తమ అధ్యాపన సమయమున వింతప్రశ్నలను వైచి తమ జ్ఞానమును పెంపొందించిన శిష్యులను గూడ శ్రీ శర్మగారు గురువులుగా భావించి చిన్నవారగు వారి కాశీస్సు లిచ్చుట వారిలోకజ్ఞతను చాటును

ప్రతిజ్ఞాఖండము – శ్రీరాముడు పట్టాభిషిక్తుడయ్యెను. మహోత్సవములు రోజుల తరబడి జరిగినవి జనకుడు తనరాజ్యమునకు ప్రయాణమైనను వెడలలేక నిలిచి యుండెను అరుంధతీవశిష్ఠులు, కౌసల్యా సుమిత్రాకైకేయులు, ఋశ్యశృంగుడు చేయు పండ్రెండేండ్ల యజ్ఞమును జూడ నేగిరి జనకుడును ఆగియాగి తనరాజ్యమున కేగెను గర్భభరాలస యగు సీత బంధువియోగమును సహింపలేక విచారించుచుండ శ్రీరాముడామె నోదార్చుచుండగా నష్టావక్రుడటకు వచ్చి వశిష్ఠాదుల సందేశమును వివరించెను సీతామనోవినోదనమునకై శ్రీరామచరితమును చిత్రపటరూపమున నిర్మింపించిన దానిని జూచి సీత మరల నరణ్యప్రాంతములను దర్శింపగోరెను. శ్రీరాముడంగీకరించెను. అలసిన సీత రామునికడ నిద్రించుచుండగా చారుడగు భద్రుడు (దుర్ముఖుడు) వచ్చి జనవ్యాప్తమగు సీతాపవాదమును చెప్పగా రాముడు సీత నడవుల విడువు మని లక్ష్మణు నాజ్ఞాపించి సీతాలక్ష్మణుల నడవులకు బంపును. ఈ ప్రతిజ్ఞాఖండమునకు సద్యోజాత మను పేరు నుంచుట కథాగమనమునకు తగినట్లే యున్నది.

సమజ్ఞాఖండము– వనమున కేగు సీతాలక్ష్మణుల మనోవిభ్రమములు వారిసంభాషణలు, కవి కథానిర్వహణశక్తిని వెల్లడించును. లక్ష్మణుడు చెప్పినమాటలకు సీత దుఃఖితయగుచుండగా లక్ష్మణుడామెను వీడివెళ్ళుట దుఃఖవివశయగు సీతను గంగావసుంధరా వాల్మీకులు, కాపాడి యోదార్చుట కుశలవులజన్మము– వీనితో నీఖండము వామదేవమను నామాంతరము గల్గియున్నది

ప్రతిష్ఠాఖండము – సీతా పరిత్యాగమున వశిష్ఠాదులు దుఃఖితులై ఋశ్యశృంగునికడ నుండుట జనకుడు నచటనే యుండుట, రాముని రాజ్యపాలనము, బ్రాహ్మణ శిశుమరణము, శంబూకవధకై శ్రీరాముడు పుష్పకమునెక్కి పంచవటీ ప్రాంతమున కరుగుట, శంబూకవధ, బ్రాహ్మణశిశు పునరుజ్జీవనము, సీతాతమసలదృశ్యరూపమున నట తిరుగుట, పూర్వస్మృతిచే మూర్ఛితుడగు రాముని సేదదీర్చుట, రాముని విలాపము, అగస్త్యుని సందేశము, దర్శనము, అనునవి ప్రతిష్ఠాఖండమున నఘోరమను నామాంతరముతో నొప్పియున్నవి.

ప్రత్యభిజ్ఞాఖండము – లోపాముద్రాగస్త్యులు శ్రీరామునకు వేదవతీ వృత్తాంతమును జెప్పి యోదార్చుట అశ్వమేధమును జేయుననుట రాము డయోధ్యకు మరలివచ్చి వశిష్ఠానుమతితో యాగసన్నాహము గావించుట, విభీషణాదుల రాకడ, వాల్మీకి తన యిద్దరు శిష్యులతో వచ్చుట, వారి రామాయణ గానము. వాల్మీకి నివేదనము తత్పురుష మను నామాంతరముతో నిర్వహింపబడినది.

ప్రత్యానయన ఖండము – యజ్ఞానంతరము శ్రీరాముడు వాల్మీకి విజ్ఞప్తి ననుసరించి అతని యాశ్రమమున కేగుట ప్రజలందరును వాని ననుసరించి యట కేగుట, కుశలవులు స్వర్గమునుండి వచ్చుట, శ్రీరాముడు వారిని తనగజముపై నెక్కించుకొని సీతకడ కేగి గుర్తించుట, సీతారాముల పారవశ్యము, రాముడు సీతాపుత్రులతో గలిసి సరససల్లాపములతో నయోధ్య కేగుట ప్రజలు సీతను గౌరవించుట రాముని రాజ్యపాలనము ఖండాంతమున కవి చెప్పిన దేశకాలపరిస్థితులను వివరించు పద్యము–తో నీశాన మను పేరుతో నీ ప్రత్యానయనఖండ మొప్పినది.

కథానిర్వహణమున చాలవరకు భవభూతిని శర్మగారు ఒరవడిగా బెట్టుకొన్నట్లుగా భావింపవచ్చును. చిత్రపట వృత్తాంతమును దాదాపు యథాతథముగ నిర్వహించి దానిఫలితములను మాత్రము యథాతథముగ నుపయోగించుకొనలేక పోయిరి ఇందు స్వగతములు తత్త్వవివరణములు మిక్కుటములై యున్నవి వాల్మీకి సీతకును, శ్రీశర్మగారి సీతకును అంతరము చాలకనిపించును వాల్మీకి కావ్యసృష్టితో లోకోపకారమునకై ప్రసాదించిన రామాయణ పాత్రలు భారతాదులయందు వలె తమదివ్యత్వమును పదేపదే సంస్మరించుట విస్మయావహము. వాల్మీకి నివేదనము నారదాది ప్రార్థితుడై రామాయణ రచనకు పూనుకున్న వాల్మీకికి దగినట్లుగా లేదనిపించును వాల్మీకి రాములసమావేశము (వాల్మీకములో) సముదాత్తముగా నున్నది. శ్రీశర్మగారు రామవాల్మీకి సమావేశమును వరప్రదాతయై ప్రత్యక్షమైన దైవము యొక్కయు, వరాకాంక్షి యగు భక్తునియొక్కయు, సమావేశము వలె చిత్రించినా రనిపించును. చిత్రపట వృత్తాంతమున రామాను గృహీతములగు జృంభకాస్త్రములు కుశలవుల నను గ్రహించినవి చిత్రపట వృత్తాంతమున సిద్ధించిన యీ ప్రయోగమును భవభూతి లవచంద్రకేతులయుద్ధమున నుపయోగించుకొనగా, శ్రీశర్మగారు ఇట్టిదివ్యాస్త్ర లాభము నాజన్మముగా నందిన కుశలవులు అపరస్త్రీల రక్షణకై స్వర్గమునకేగినట్లు చెప్పి యుపయోగించిరి. దివ్యాస్త్రలాభమిట్టి కార్యముచే సూచితమాయని యనిపించును

అట్లే సీతా పరిత్యాగ సమయమున నయోధ్యలో లేని వసిష్ఠాదులు సీతాపరిత్యాగమును విని దుఃఖితులై సీతలేని యయోధ్యను ప్రవేశింప నొల్లక ఋశ్యశృంగుని కడనుండి, యటనుండి వాల్మీకి యాశ్రమమున కేతెంచిరి పుత్రీపరిత్యాగ దుఃఖితుడగు జనకమహారాజు తానును అటుపోయి యాదృచ్ఛికముగా వారిని గలిసెను శ్రీశర్మగారు జనకుడు పుత్రీ పరిత్యాగమునువిని యుండబట్టలేక ఋశ్యశృంగుని యాశ్రమమునకే పోయినట్లును, శ్రీరాముని యశ్వమేధమునకు జనకాదులు అరుంధతీ వశిష్ఠులు వచినట్లును జెప్పిరి మరి కౌసల్యాదులు వారితో వచ్చి శ్రీరాముడు యజ్ఞమున నుంచిన సీతాస్వర్ణ ప్రతిమలను జూచి చేతోమోహమందిరట అప్పుడు శ్రీశర్మగారి వశిష్ఠాదులదృష్టిలోను, భవభూతి నిర్వహణలోని వశిష్ఠాదుల దృష్టిలోను సీతకుగల పాత్రౌచిత్యమేమి? జనకాదులకు గల యనురాగమదెట్టిది ఆదిమధ్యములలో నున్న జనకుడంతమునం గూడ సాక్షాత్కరించిన మరింత బాగుండెడిది కదా!

వాల్మీకి సీతాప్రతిజ్ఞ, రసాతల ప్రవేశము మున్నగువానిని నిర్వహించి, సీతాపాత్రకు గల యుదాత్తతను పోషింపగా, భవభూతి దాని యందలి పారుష్యమును వీడజాలక యంతర్నాటకమున దానిని సంగ్రహించి తన విధానములో కథను సుఖాంతము గావించెను శ్రీశర్మగారు సీతను యోగినీమాతగా, పరముస్నిగ్ధగా మనస్వితాపరిపూర్ణగా జిత్రించిరి భవభూతియేకాక దిజ్ఞాగాదులును కుందమాలాదులలో సీతారాములనుయన్నోచితముగనో యథాశక్తిగనో భావించి మహాత్ములై చారితార్థ్యము నందిరి అట్లే శ్రీశర్మగారును శ్రీవిద్యానిష్ఠులగుటచే రామకథలో శివాద్వైతమును భావించి యథావకాశముగ జిత్రించిరి శ్రీరామ రాజ్యమనుట వారి స్వగతములను, తత్త్వవివరణలకు తగినట్లున్నను, అప్పుడప్పుడు వ్రాసిన వాని నిందులో సామ్యము చేసికొని రని పాఠకులకు కొంత వైముఖ్యమును గలిగించును. ఇందలి ప్రతి పద్యమును దేనికదే మనోహరము. కాని యట్టివి బహుళము లగుట వలని యిబ్బందియే యిది. అట్లే సీతారాముల సమాగమమును జెప్పి పౌరులస్వగతములను వివరించి పిమ్మట సీతారాముల సంభాషణను గూర్చుట జరగినది. చిరకాలమునకు ప్రవాదభిన్నులై కలసిన నాయికా నాయకుల పరస్పరహృదయ వివరణాత్మక మగు సంవాదము జనుల తాత్త్విక విచారణలచే ప్రశంసలచే నంతరితమగుట బాధాకరము

శ్రీరామకథను వాల్మీకి కావ్యముగనే రచించెను కాని విమర్శక బహుళమైన మన సహృదయ ప్రపంచ మతివేలభావనచే యథాశక్తిగ యథోచితముగ భావించుటయే యిట్టివానికి మూలము. నామకరణములోనే శ్రీశర్మగారి కౌశలము, లోకజ్ఞత సూచితములగుచున్నవి ఉత్తరకాండకథను సంపూర్ణముగ వివరింపక సుఖాంతము గావించుటకై శ్రీ శర్మగారు చూపిన నేర్పు ప్రశంసనీయము ఇందు వాక్శక్తి, అనుభవము, నిరంతర వాఙ్మయానుశీలనము, భావుకత, కథానిర్వహణ మున్నగునవి యడుగడుగున సుస్పష్టములై కొట్టవచ్చినట్లగపడును

శ్రీశర్మగారు భవభూతి శ్లోకములనను వాదప్రాయముగా కొన్నిటి ననుకరించిరి 'స్వాపహేతు రనుపాశ్రితోన్యయా రామబాహురుపధానమేష తే' దీనికి 'పత్యహమున్ సీతకె స్వాపహేతు వగు చన్యాసంగభావంబె దుస్సహమా రాముని బాహువే తలగడౌ స్వాపంబు నందంగదే'' రాముడు సీతతో అన్యానుపాశ్రిత మగు నీరామబాహువు నీకు తలగడ యగునని పలికిన యీ మూలమునకీ యనుసరణ

గమనింపదగినది. అన్యాసంగ భావంబు దుస్సహమైన యీ బాహువు సీతకు స్వాపహేతువు కావలె ననుట మూలాతిక్రాంతమై మరి తగా భావించినచో సీతకు గల్గిన రావణస్పర్శను సూచించుచు అన్యాసంగ భావమే దుస్సహమైన(సీతకు లోగడ రావణుని స్పర్శ దుస్సహమైనను తప్పలేదు. అల్లే రాముని తను తప్పలేదా?) బాహువను విపరీతార్థమునిచ్చు ప్రమాదము గలదు. దుస్సహమౌ - తలగడౌ యిందలి ఔకారద్వయము అర్థమునకు పుష్టికరమైనను శ్రవణసుఖకరము కాదనిపించును. మూలమును చూడనిచో నివి చాల బాగున్న వనుట నిశ్చయము. ఇట్టివి కొంత విభ్రాంతిని గలిగించును.

110 పే - 106 - ఉద్వేగతాళిల, 111 లో 174 - ధూమ్యాశ్రయున్, 113 లో 185 - నేనున్నాను మోహాంధుడై 118 లో 218 లో - గగన వాల్యుధానకం ధూములు, 133లో 67- ప్రాతిరౌపాస్తి, 154 లో 200, సుస్వేచ్ఛన్ 162 లో 249 - బంధురధీకలు - 45లో 243 మదీదవసింపు, 107లో 139 - లోపలేదుద పాపాత్ముడతండు, 173లో 31వ.హిరణ్య సహస్రశతల, 178 లో 849 - వైరాగ్య పాపఘనయా 180 లో 363, రామజానకీనందనులు 187 లో 409 - ఆత్మనిమున్గి 210 లో 126- కుమారుల నప్పగించిరిన్. ఇట్టివానికి సవరణలను గాని వివరణలను గాని యిచ్చిన బాగుండెడిది.

ఇట్టి గ్రంథములు ప్రతి గ్రంథాలయమున నుండదగినవి. ప్రతి విశ్వవిద్యాలయ విద్యార్థియు (సంస్కృతాంధ్రముల వారైనను) తప్పక చదువవలెను. ప్రజలే రాజైన యీకాలమున వీరిని ప్రజలు ప్రజాప్రభుత్వము ఆదరించి గౌరవింపవలసియున్నది. వీరి గ్రంథమును పాఠ్యగ్రంథముగా నిర్ణయించుట సముచితము. శ్రీజ్ఞాన ప్రసూనాంబికా కాళహస్తీశ్వరుల కృపాలేశము నందిన వీరిని, వీరి కవితను శ్రీవేంకటేశ్వరస్వామియును దయజూచి వీరికి వీరికావ్యములకు సముచిత ప్రతిపత్తిని కలిగింపగలడని మనము కోరవలెను. వీరి యముద్రిత గ్రంథములు ముద్రితములై ముద్రితములు పునర్ముద్రితములై, ప్రజలచే, ప్రజాప్రభుత్వముచే, సహృదయులచే, బహుధా ఆదరింపబడవలెనని కోరుట సహృదయుల ధర్మము. శ్రీ శర్మగారును తమ నిరంతర కవితా సస్యసంపత్తిని కాళహస్తీశ్వర స్వామికడ, జ్ఞాన ప్రసూనాంబికకడ దాచక సర్వతోముఖ ప్రసారితము గావింప యత్నింపగలరని మన మాశింపవచ్చును

—•••—

## 2) హంస దూతము

[అనువాదకర్త: శ్రీనాదెళ్ళ వేంకటరావుగారు. ప్రాప్తిస్థానము : శ్రీరామానందగౌడీయ మఠము. కొవ్వూరు. వెల : 75 పైసలు.]

కాళిదాసుని మేఘసందేశము పెక్కు సందేశకావ్యములకు మార్గదర్శకమైనది, అట్లు వచ్చినవానిలో శృంగార ప్రధానములేకాక భక్తివైరాగ్యాది ప్రధానములును కలవు. చైతన్య సంప్రదాయమునందు ప్రముఖుడగు శ్రీరూపగోస్వామి సంస్కృతమున హంసదూతమును రచించెను. ప్రౌఢరీతిలో రచించిన వారి హంసదూతమును శ్రీనాదెళ్ళ వేంకటరావుగా రనువదింపగా దానిని శ్రీరామానందగౌడీయ మఠము వారు ముద్రించిరి. అనువాదముతో పాటు మూలమును గూడ ముద్రించుటచే నీగ్రంథ గౌరవము హెచ్చినది. వెలయు స్వల్పమగుట మరియొక విశేషము.

శ్రీకృష్ణుడు కూరునితోఁ గలిసి మధురానగరమున కేగి నందగోపకుల మందలి ఘోషయువతీ బృందమును, తనకిష్టురాలగు రాధను మరచెను. రాధవిరహమును జూడజాలక యామె చెలి లలిత తోటలో నగపడిన హంసను మథురానగరమార్గమును, రాధావిరహమును వర్ణించి యామె దీనావస్థను కృష్ణున కెరిగింపుమని కోరుటయే యిందు ప్రధానము. రాధను మాయాగ్రస్తుడగు జీవునిగను కృష్ణుని పరమాత్మగను భావించి వారు వియోగమును వీడి సంయోగము నందుట తాత్త్వికముగా ముఖ్యమని భావింపవచ్చును. అంతమున శ్రీకృష్ణుడా సందేశమును విని రాధానుగ్రహము గావించినట్లు చెప్పినను, సూచించినను, బాగుండెడిది. ఈ వియోగమే జీవసహజమని భావించిరేమో తెలియదు.

శ్రీ నాదెళ్ళవారు భాషాసంపద పుష్కలముగా గలవారు. వీరి ధారాశుద్ధి మొదలగునవి ప్రతి పద్యమునందును సాక్షాత్కరించును. ముద్రారాక్షసములు చాల గలవు. తప్పొప్పులపట్టిక వేసిన బాగుండెడిది.

3వ పద్యములో హరిన్ భావించి భావంబునన్. అనుచో అనుప్రాసకై యత్నముమాని చిత్తంబునన్ అనిన బాగుండెడిది. 5వ ప. లతికాకస్యస్తగావించుచున్, (అన్వయము యూహ్యము) 11వ పద్యములో 'మోదివై సదయవై వేగంబుగా హంసమా. (సదయ-స్త్రీలింగము - హంసము - పుంలింగము - విశేషణ విశేష్య భావము భిన్నలింగక మైనది) 19 లో మారాధ జీవింపకున్. 53లో నెంతో గర్వ్యమో హంసమా- (గర్వ్యమనుపద మిట యుక్తము కాదు) 57లో బృందను నేత (సు- ఉపసర్గమెందులకు?) 63లో పురనారీ వురువిభ్రమ (నారీ+ఉరు-సంధి రావలెను. వురు అనుపద మేమి ?) అందే సౌధ మాధుర్య (సౌధమనుట ఇట గృహవాచకము కాదు. అమృతసంబం

ధము అనిన చాలును. కాని అది అన్వయ దూరము) అందే (తక్రంబు వక్రాత్ముడై' (విశేషణ విశేష్య భావము దాత్తముకాదు) 67లో అదిన్, 68లో గతాగోపలకథా అనుదానికి విధి నేమన దగున్- (సరియైన యనువాదము కాదు) 72 లో 'శ్యామ స్వాములకిద్ది దుష్పరిహార స్వాభావికంబే కదా- (ఈయనువాదము మూలమునకు దగినదికాదు 84 లో 'ప్రవృత్తరసాసన్ లిఖియించి (ఇట నీవిశేషణ మేల) ఇట్టి సెరసులు కొన్నికలవు. ఏమైనను శ్రీకవి గారి అనువాద సరళి ప్రశంసనీయము వీరు మరింత కృషిచేసి స్వతంత్ర కావ్యముల నితోధిక సుందరముగా రచింపగల రని మన మాశింపవచ్చును



# 3) శ్రీమద్రామాయణము

(అయోధ్యాకాండము - పూర్వభాగము)

తాత్పర్య సహితము

[తాత్పర్యకర్త - శ్రీ శ్రీమాన్ సి వి. శేషాచార్యులుగారు. ప్రతులకు శ్రీ జయ లక్ష్మీపబ్లికేషన్సు, కేశవనగర్. శ్రీనగర్ కాలనీ P O హైదరాబాదు సాదా ప్రతి వెల 20 రూ పుటలు - 579]

గంగాహిమాలయములవలె పవిత్రోన్నతులైన వాల్మీకి శ్రీరాములు సర్వజన సంసేవ్యులు పరస్పరప్రకాశకులు, శబ్దార్థములవలె నుభయులు సద్యస్ఫూర్తికల వారు వాల్మీకి యాదికవియైనచో శ్రీరాముని ఆదినాయకు డని చెప్పుట ధర్మము. కవినాయకలక్షణము లాయిరువురి యందును ఘనీభవించి 'యావత్ స్థాస్యంతి గిరయః- తావద్రామాయణ కథాలోకేఽస్మిన్ ప్రచలిష్యతి' యని దివ్యాశీస్సులను వరముగా నంది నిలచినవి. అలంకారికులు నిర్వచించు కావ్యప్రయోజనము లెబ్బడి ముబ్బడిగా రామాయణమువలన సిద్ధించు ననుట యనుభవైకవేద్యము శ్రీరాముని స్మరింపని (ఏదోయొక విధముగా తమ కావ్యములయందు) కవి సంస్కృతాంధ్రముల లేరనుట దాదాపుగ నిష్ప్రపంచమైన దని చెప్పవచ్చును భవభూతిప్రభృతులును ఆరామకథను భావించి, సంభావించి, చారితార్థ్యమునంది రనవచ్చును

అట్టిప్రశస్తి నందిన వాల్మీకిరామాయణము మనభారతీయసంస్కృతికి ధర్మమునకు వేయేల మనయుచ్ఛ్వాస నిశ్వాస ప్రాయమగు సమస్తజీవన పరీవాహమునకు తీరమై నిలిచియున్నది. అట్టి రామాయణము సంస్కృతములో నుండుటచే దాని యందు గౌరవాభిమానము లున్నను సంస్కృతభాషా ప్రవేశము లేకపోవుట వలన చాలమంది అనువాదములపై సాధారపడి రామాయణామృతమును యథాసంభవముగ గ్రహింప యత్నించుచున్న వారు. అట్టి వారి సౌకర్యమునకై శ్రీజయలక్ష్మి పబ్లికేషన్సువారు పండితులు, కళాశాలోపన్యాసకులు, నగు శ్రీమాన్ సి వి శేషాచార్యులు వారిచే రామాయణమును ఆంధ్ర తాత్పర్యముతో, ప్రసిద్ధములగు వ్యాఖ్యాచతుష్టయ విశేషములతో సరళమగు ఆంధ్రభాషలో వ్రాయించి ఆంధ్రలిపిలో సంస్కృతమూలముతో ముద్రించుచున్నారు ప్రకటించుచున్నారు. బాలకాండ వచ్చి సంవత్సరము కాకుండగనే అయోధ్యాకాండ పూర్వభాగమును వీరిది యొక్క సర్గలతో ప్రకటించిరి. ఇందలి భాష, ముద్రణము, మూల శ్లోకములు, ఉపయుక్తమగు కాగితము ఒకదాని నొకటిమించి బహుళ సుందరములై యున్నవి. ఆయా సంప్రదాయములవారికి దగినట్లు పారాయణోపక్రమ, ఉపసంహార సంబద్ధములగు శ్లోకములతో గాయత్రీరామాయణముతో నిది ఒప్పియున్నది శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారి యార్ద్రమగు నభినందనముతో మనోహరమై యున్నది సుమారు నలుబదియేండ్ల క్రిందట శ్రీ వావిళ్ళవారు సంపూర్ణ రామాయణమును తాత్పర్యముతో ప్రకటించిరి. ఇప్పు డది దుర్లభము శ్రీ ఆచార్యులవారి తాత్పర్యము ముద్రణావిధానము మున్నగు నవన్నియు వావిళ్ళవారి వానికంటె చక్కగా నతిశయించు స్థితిలోనున్న వని విజ్ఞులు గుర్తింపకమానరు

శ్రీ ఆచార్యులవారు సంపూర్ణవిరామము మున్నగు సగుపాయముల నేర్పాటుచేసి ఆస్తికమహాశయులకు రామాయణము నందింప పలుమార్గముల నేర్పాటు గావించిరి ఇట్టిగ్రంథమునకు గ్రంథాలయములు ఆస్తికులు, ధనవంతులు ప్రభుత్వము, ధర్మసంస్థలు, దేవాలయములు చేయూత నిచ్చి అర్థికాదిసహాయము నిచ్చి, పరిచితులకు దీనినిగూర్చి వివరించి కొనిపించి, యథాశక్తి పలువిధముల సాయపడి శ్రీరాముని స్మరించి యుత్తేజితులై దాని నితరుల కందించి శ్రీ ఆచార్యుల వారి ప్రయత్నమును సార్థకము చేయుట ముఖ్య కర్తవ్యము రామాయణము సుందరకాండను మాత్రమే ప్రకటించువా రనేకులు కాని మొదటి నుండియు సమూలముగ తాత్పర్యముతో వ్యాఖ్యాచతుష్టయ విశేషములను విడువకుండ నిట్లు చక్కని ముద్రణాదులతో నిట్లు ముందుకు గొని వచ్చి సాహసముచూపి ప్రశంసనీయులగు శ్రీఆచార్యులవారి ప్రయత్నమును ప్రోత్స

హించి వారి కిచ్చిన ప్రశంసను సార్థకము గావించుట సహృదయత, ఆస్తికత, ధార్మికత, కల మనవారి కర్తవ్యము అచ్చు తప్పులెంత వెదకినను కనిపించక పోవుట ముఖ్యవిశేషము. శ్రీరామకటాక్షముచే శ్రీ ఆచార్యులవారు త్వరలో మిగిలిన కాండలనుగూడ తాత్పర్యముతో ప్రకటింపగలరని యాశింపఁదగును.

— శ్రీ ప్రసన్న.

—*—

## 4) అవగాహన

ప్రగతిశీల సాహిత్యోద్యమం ప్రధానలక్ష్యంగా విజయనగరంలో స్థాపింపబడిన బుక్స్ అండ్ బుక్స్ అనే సంస్థ ప్రచురణగా వెలువడుతున్న అవగాహన- 1, 2, 3, సంపుటాలు మా కార్యాలయము చేరినవి.

శ్రీశ్రీ ముఖచిత్రముగా వేయబడిన 'అవగాహన 1' లో ఆచార్య రోణంకి అప్పలస్వామి, కొడవగంటి కుటుంబరావుగార్ల వ్యాసాలు. చాగంటి సోమయాజులుగారికథ, ఏ. వీ రెడ్డిశాస్త్రి గారి పెద్దకథ, నగ్నముని కవిత వగైరాలతోపాటు పుస్తక సమీక్షలు కూడా వున్నవి.

శ్రీరంగం నారాయణబాబు ముఖచిత్రముతో వెలువడిన అవగాహన- 2లో ఆచార్య రోణంకి, కొడవగంటి, సోమసుందర్ గార్ల వ్యాసాలు, జల్లు నారాయణమూర్తి రాజు, శ్రీరంగం రాజేశ్వరరావు, ఆర్. చంపారాణి గార్ల కథలు, చాసో కవిత మొదలైన రచనలున్నాయి 'శ్రీరంగం నారాయణబాబు జీవితము సాహిత్య వ్యక్తిత్వము'పై మానేపల్లి సత్యనారాయణగారి సుదీర్ఘ వ్యాసము ఈసంచికలో అతిముఖ్యమైన రచన.

కొడవగంటివారి ముఖచిత్రంతో వెలువడిన అవగాహన- 3 లో "సాహిత్య ప్రయోజనం లేని రచన గొప్పదిగా ఉండగలదా ? అని చర్చిస్తూ కొడవగంటివారు వ్రాసిన వ్యాసం, కృష్ణశాస్త్రిపై ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి వ్యాసం, కృష్ణశాస్త్రి అముద్రిత వ్యాసం, శ్రీశ్రీ గురించి ఆచార్య రోణంకి వారి అభిప్రాయాలు, మరికొన్ని కవితలు సమస్యలతోపాటు - ఇటీవల శ్రీశ్రీపై చెలరేగిన వాద ప్రతివాదాల్ని సమగ్రంగా చర్చిస్తూ 'శ్రీశ్రీ మహాకవిత్వం ఒక పరిశీలన' అనే మానేపల్లి సత్యనారాయణ గారి వ్యాసం ఉన్నవి.

పై మూడు సంపుటాల సంకలనకర్త శ్రీ మానేపల్లి సత్యనారాయణ ¼ డెమ్మీ సైజులో 82-40 పేజీలతో వెలువడిన పై సంపుటాలు ఒక్కొక్కటి 2 రూ॥ లు. వ్యాపారదృష్టికి అతీతంగా స్వచ్ఛందంగా సాహితీపరులఅవగాహనను పెంపొందించాలనే జరుగుతున్న కృషికి ఈ వెల తక్కువే. మూడు కలిపి కావలసినవారు ఈదిగువ చిరునామాకు 6రూ॥లు పంపిస్తే (తపాలా ఖర్చులు ఉచితం) తిరుగు టపాలో పంపబడతాయి.

ఎమ్. నళినీదేవి, బుక్స్ అండ్ బుక్స్, బొండాడవీధి, విజయనగరం-531 201.

+ +

## 5) కృష్ణవేణీనదీ

### మాహాత్మ్య సంగ్రహము

[రచయిత శ్రీ చెరువుపల్లి రామేశ్వర, శర్మ. పబ్లిషర్సు లహరి ఎంటర్ ప్రైజెస్ విజయవాడ- 2. పేజీలు 24 మూల్యము రు 1-50 లు ]

గత కృష్ణానదీపుష్కర సందర్భమున ప్రచురింపబడిన యీ చిన్నగ్రంథమున కృష్ణానది జననము, తీరస్థములయిన అనేక క్షేత్రముల ఉత్పత్తి మహిమాది విశేషములు అతి సరళమైన భాషలో వివరింపఁ బడినవి పుష్కరమహిమ తత్సమయ కర్తవ్యవిధులు, ఫలితము, తెలుపబడినవి పుష్కరకాలముననే కాక ఎల్లపుడు తెలిసికొనదగిన అనేక తీర్థక్షేత్ర విశేషము లిందున్నవి. అచ్చుతప్పులచటచట కానవచ్చుచున్నను, ముద్రణము రమణీయముగా నున్నది. ఆస్తికు లెల్లరు అవశ్యము పఠింపదగిన గ్రంథము.

— —

## 6) పుష్కరగౌతమి

### కవితా సంకలనం

గత గౌతమీ పుష్కర సమయంలో రాజమండ్రి పట్టణమున జరగిన కవి సమ్మేళనంలో పాల్గొన్న 12 గురు ప్రముఖ కవుల కవితాంశము లిందుగలవు. ప్రాచీన మూఢాచారవిముఖుడు, ప్రసిద్ధ సంస్కర్తయిన శ్రీ కందుకూరి వీరేశలింగముగారి పురమందిరమునవీతత్సంస్థధర్మకర్తృత్వసమితి దీనిని నిర్వహించుట విశేషము గౌతమీ చిత్రము నన్నయ శ్రీనాథుల చిత్రములు, వీరేశలింగంగారి యొక్కయు పురమందిరము యొక్కయు చిత్రములు నిందు గలవు. ముద్రణస్ఖాలిత్యాదులు విరళములు. ముద్రణము సుందరము.

16 పుటలుగల యీ చిన్నిపొత్తము వెల రు1-00. వీరేశలింగపురమందిర ధర్మకర్తృత్వసమితి - రాజమండ్రి.

# 22. 'సమాలోచన' తృతీయ సంపుట రచనల పట్టిక

| రచన, రచయిత | సంచికల నంబరు |
|---|---|
| 112. ధ్రువం పద్య<br>శ్రీ భారతీ ప్రియ | 20 |
| 113 నండూరివారి ఎంకిపాటలు<br>శ్రీ కర్రా కార్తికేయశర్మ | 5 |
| 114 నగ్నముని కొయ్యగుఱ్ఱం<br>శ్రీ సోమసుందర్ | 11 |
| 115. నదీ సుందరులు<br>శ్రీ పి. వి. ఎస్. ఆర్. శర్మ | 5 |
| 116 నన్నయ - కాదన కిట్టిపాటి<br>శ్రీ పరిమి సాంబయ్య, ఎం ఏ | 1 |
| 117. నన్నయ తరళము<br>శ్రీ పరిమి సాంబయ్య, ఎం ఏ. | 13 |
| 118. నన్నయ ప్రసన్నకథావివిధార్థయుక్తి<br>శ్రీ పరిమి సాంబయ్య, ఎం ఏ | 5,6 |
| 119 నన్నయభట్టారక జయంతి రిపోర్టు | 2 |
| 120. నన్నయ భారతంలోని శైశవలీలలు<br>శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ, ఎం.ఏ. | 17 |
| 121. నమూనా మునిసిపలు కౌన్సిలు సమావేశం రిపోర్టు | 14-15 |
| 122. నవ్వు పద్య<br>శ్రీరామడుగు వెంకటేశ్వరశర్మ, ఎం ఏ. | 9 |
| 123 నాకు నచ్చినకావ్యం - ఖడ్గనారాయణం<br>శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం.ఏ | 11 12 |
| 124 నా చెల్లి గేయం<br>శ్రీ మల్లాది కామేశ్వరరావు | 10 |
| 125 నాదయోగి పద్య.<br>శ్రీ శనగన నరసింహస్వామి | 1 |
| 126 నా దేశము. పద్య<br>శ్రీ వసంతరావు రామకృష్ణారావు, ఎం ఏ. | 10 |
| 127. నానారుచిరార్థసూక్తినిధి నన్నయ<br>శ్రీ పరిమి సాంబయ్య ఎం ఏ | 11 |
| 128, నాయకులు పద్య<br>కవికోకిల శ్రీ మామిండ్ల రామగౌడు | 9 |
| 129. నిత్యవ్యవహారంలో కొన్ని వింతప్రయోగాలు<br>శ్రీ టి యస్ ఆర్ ఆంజనేయులు | 1 |
| 130. నేటి కథానికా సాహిత్యపు తీరుతెన్నులు<br>శ్రీమతి వాణీచలపతిరావు | 11 |
| 131 నేటి కలలో రేపటిమనిషి గ్రం. వి.<br>శ్రీ సోమసుందర్ | 13 |
| 132. నేనుకాక మరోనలుగురు వచన<br>శ్రీ కర్రా కార్తికేయశర్మ | 1 |
| 133. పంచాంగ రచనలో వైరుధ్యాలు<br>శ్రీ మధుర కృష్ణమూర్తిశాస్త్రి | 18-19 |
| 134. పంప-నన్నయ-భారతరచనాప్రణాళిక<br>శ్రీ పరిమి సాంబయ్య, ఎం ఏ. | 9 |
| 135. పరుశకోసమే గేయం.<br>డా. యస్. గంగప్ప, ఎం.ఏ , పిహెచ్. డి. | 5 |
| 136 పలుకే బంగారం. పద్య<br>శ్రీ రామడుగుల వెంకటేశ్వరశర్మ, ఎం. ఏ | 12 |
| 137. పారిజాతాపహరణ కావ్యసౌరభము<br>శ్రీ ఎ కృష్ణప్ప, ఎం ఏ , బి ఎస్ సి. | 17 |
| 138 పిరదౌసి-గుణాఢ్యుడు తులనాత్మకసమీక్ష<br>శ్రీ రామడుగు వేంకటేశ్వరశర్మ, ఎం. ఏ. | 10 |
| 139 పురుషార్థసుధానిధి అనువాదము.<br>శ్రీ సీతారామశాస్త్రి | 4,11,12,13 |
| 140 పుష్పప్రమోదము - ప్రయోజనాత్మకత<br>డా. జి. బి యస్ ఆచార్య, ఎం ఏ. | 14,15 |
| 41. ప్రతీక్ష పద్య.<br>శ్రీ ఎస్ వి రాఘవేంద్రరావు, ఎం ఏ ,బి యిడి. | 10 |
| 142. ప్రబంధశృంగారములోశిల్ప చమత్కృతులు<br>శ్రీ కందనెల్లి భద్రన్న, ఎం.ఏ | 23 |
| 143. ప్రస్థానగీతి పద్య<br>శ్రీ శనగన నరసింహస్వామి, ఎం. ఏ | 20 |
| 144 ప్రేమచంద్ గోదాన్<br>శ్రీ నముమాస స్వామి, ఎం. ఏ. | 24 |
| 145 ప్రేమ విచికిత్స<br>శ్రీమతి కమలాదేవి, ఎం ఏ | 21 |
| 146 ఫలితం [ఎన్నికల] సంపాదకీయం | 6 |
| 147. బలిజేపల్లివారి సత్యహరిశ్చంద్ర నాటకం<br>శ్రీరామడుగు వేంకటేశ్వరశర్మ ఎం ఏ. | 13 |
| 148 బసవరాజువారి గీతపారిజాతపరిమళాలు<br>డా జి. బి యస్ ఆచార్య, ఎం ఏ., పిహెచ్ డి. | 6 |
| 149 బాపురెడ్డి గద్యకావ్యాలు<br>శ్రీ కర్రా కార్తికేయశర్మ | 13 |
| 150 బాపురెడ్డి గేయాలు<br>శ్రీ కర్రా కార్తికేయశర్మ | 22 |
| 151. బాపిరాజుగారి అసంపూర్ణనవల మధురవాణి<br>శ్రీమతి ధనిరెడ్డి విజయలక్ష్మీదేవి | 1 |
| 152 బాలసాహిత్య సంక్షిప్త వివరణము<br>శ్రీ ఎస్. రాజశేఖర్, బి. ఏ (రత్నశ్రీ) | 6 |
| 153. బి వి బి కె సత్యనారాయణరావుగారి పరిచయం | 16 |

## 23. స్వవిషయం

పత్రికా ప్రచురణలో ముఖ్యముగా కేవల సాంస్కృతికపత్రికా ప్రచురణమున ఎదురయ్యే అనేక క్లేశములను తప్పించుకొని సమాలోచన నాలుగవ సంవత్సరమున అడుగిడినది. లక్ష్యసిద్ధి కభిముఖముగా నెతవఱకు నడచుచున్నది? అను విషయమునకు సహృదయ పాఠకులే ప్రమాణము.

రచయితలు, పాఠకులు మాకొసగుచున్న హృదయపూర్వక సహకారము మిక్కిలి ఆనందకరముగా నున్నది. వారికి కృతజ్ఞతలు. ఆప్రోత్సాహమే యూతగా ఆర్థికాది ఇతరఅసౌకర్యముల నధిగమించి ప్రగతిపథమున సమాలోచన ముందడుగు వేయగలదని సవినయ విజ్ఞప్తి.

## రాజమండ్రి నామవిచారము

కొలదికాలమునుండి ఈ నగరనామము విషయమున ప్రచారము జరగుచున్నది. దీనిపురాతన నామము రాజమహేంద్రి కాని రాజమండ్రి కాదని, విదేశీయ-ఉచ్చారణాదుల సాంకర్యముచే ఏర్పడిన అపరూపమే రాజమండ్రి యనీ దానిని విసర్జించి పురాతన నామమును పునరుద్ధరించవలెననీ రాజమహేంద్రునిచే పాలితమైన దీనికి రాజమహేంద్రి నామకరణము సముచితమని, ఇది చరిత్ర సమ్మతమనీ ప్రకటనలు వెలువడుచున్నవి రాజమండ్రి సమాచార పత్రిక దీనిని ఏకపక్షముగా (ప్రభుత్వ పక్ష ప్రకటన లేకుండగనే) రాజమహేంద్రిగా తఱచు వాడుచున్నది

రాజమహేంద్రవరము అనువాడుక కూడ ఈనగరమునకు గలదు రాజమందిరముఅను పేరు సముచితమని, రాజమండ్రి నామమునకు సన్నిహిత మని అదియే సంగ్రహోచ్చారణ సుందర మనీ ప్రముఖులొకరు సూచించిరి. మందిర శబ్దమునకు గృహార్థస్ఫూర్తియే కాని నగరార్థస్ఫూర్తి లేదని అందుచే అదితగదని ప్రతిసూచన చేయబడినది.

ప్రాచీన చరిత్ర ప్రసిద్ధ నగరాలన్నిటికీ ఇపుడా పేర్లే ఉన్నవా? ప్రాచీన ప్రసిద్ధినిబట్టి ప్రస్తుత నగరానికి ప్రసిద్ధి తేగలమా? తరువాత తరువాత వచ్చిన అనేకరంగాలలో ప్రసిద్ధులయిన వారి పేర ఆయా నగరాలపేర్లు మారడం సముచితం కాజాలదా? అలా చారిత్రక నామధేయ పునరుద్ధరణం రాజమండ్రి కొక్కదానికేనా శోభావహం? దేశంలోని యితర నగరాలన్నిటికీ అది వర్తిస్తుందా? ఈ విషయాలన్నీ పర్యాలోచిస్తే సంగ్రహ స్వరూపంలో చాలకాలంనుండి వాడుకలో వస్తున్న రాజమండ్రి నామమే సముచిత మని చెప్పవచ్చును వర్ణవ్యత్యయాదులతో అనేక సంస్కృత శబ్దాలని తెలుగులో వాడుకోవడంలో అనౌచిత్యం ఏమీ లేదని విజ్ఞులంగీరింపకపోరు. ‘డ్రి’ అన్నది కొంచెం పరుషంగా తోచిన, రాజమందిరము అనుటలో విప్రతిపత్తి లేదు. మందిర శబ్దానికి నగర మనే అర్థం కలదు. సద్యస్స్ఫురణ నగరానికికాక భవనానికే అనుకున్నాదోషము లేదు. రాజభవనము అనగా రాజనిలయము, రాజధాని అని సమంచితార్థము నే చెప్పుకొనవచ్చును రాజమహేంద్రవరములోని వరము శబ్దమునకు ప్రాకరణికార్థము కానబడదు చరిత్ర సంగతి అటుంచి ఆలోచించినచో రాజమహేంద్రిలోని మహేంద్రిపదమునకును సుసంగతార్థము కానరాదు రాజమండ్రి పదమును మార్చవలసిన ఆవశ్యకత లేదనీ, మార్చితీరవలయునన్నచో ‘రాజమందిరమే’ సముచితతర మని సమాలోచన అభిప్రాయపడుచున్నది.

## ధరలు

జనతా ప్రభుత్వపతనము, చరణ్ ప్రభుత్వ పతనము జరగి ఐ కాంగ్రెసు ప్రభుత్వము నెలకొన్న తర్వాత ధరలు తగ్గి శాంతిసౌఖ్యాలతో తులతూగవచ్చునసుకొన్న ప్రజానీకంఆశ లడియాసలయినవి నూతనప్రభుత్వాగమనానంతరం రమారమి పదిమాసములలోను ద్విగుణంగానూ త్రిగుణంగానుకాకుండ ఆకాశమంటేలా ధరలు పెరిగిపోయినవి సామాన్య జనానికి నిత్యజీవితం ఇంచుమించు అసాధ్యమైపోయింది వస్తూత్పత్తి తగ్గుదలయే అన్నిటిధరలూ పెరగడానికి కారణం అని నమ్మశక్యంగా వుండా వున్నది అనేక నిత్యజీవితావసర వస్తువు అపరిమితంగా అండర్‌గ్రౌండ్సులో దాగి కృత్రిమమైన కొఱతను సృష్టిస్తూన్న సంగతి సర్వవిదితం ఈపరిస్థితికి ప్రభుత్వాధికారుల అసమర్థత, వణిగ్వరుల అవినీతి కారణమని ప్రజల దృఢాభిప్రాయం.

మూడేండ్ల జనతాపాలనయా? మూడు నెలల చరణ్ పాలనయా, ముప్పదేండ్ల కాంగ్రెసుపాలనయా ఈ దారిద్ర్యానికి కారణం అన్న చర్చవల్ల ఫలితంశూన్యం. ఎవరు కారణమైనా ప్రజ నేటి దుస్థితిని భరించేస్థితిలో లేదు. ప్రస్తుత దుస్థితి బాధ్యతను, నివారణబాధ్యతను, ప్రస్తుత ప్రభుత్వం అంగీకరించక తప్పదు.

ఒక్కమాఱుంగా ఈపరిస్థితిని చక్కబఱచేటందుకు మాదగ్గర మంత్రదండం లేదనే చతురోక్తులతో ప్రజానీకం కష్టాలకు ఉపశాంతి లభించదు ధరలు హెచ్చుగాలేవు నిలకడగా ఉన్నాయి, లేదా తగ్గుదలలో ఉన్నాయి, అనే వారికి భగవంతుడు తప్ప ఎవరూ సమాధానం చెప్పలేదు ఇదేస్థితి కొనసాగినట్లయితే ప్రజల ఓటుకి మంత్రదండశక్తి సంభవించగలదని గమనింపక పోవడం దివాంధత్వమే కాగలదు

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది. వెల రు. 20 లు ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము.

రెండవ సంపుటము వాల్యూములును కొలదిగా ఉన్నవి. వెల రు. 20 లు ఎం. ఒ. చేసిన వారికి పైవిధముగనే పంపబడును. వి. పి. పద్ధతి లేదు.

మొదటి సంపుటము ప్రతులు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

16—11—80 సంచికలో వాస్తవకథనంలో అవాస్తవాలు, మనుచరిత్ర - ఒక పరిశీలన, సారంగధరుని కథ - ఒక పరిశీలన, రాధ మధురగాథ మొదలగునవి ఉంటాయి.

అడ్రసు —

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.